# శ్రీకృష్ణదేవరాయచరిత్రము


గ్రంథకర్త

వద్దూరి శ్రీరామమూర్తి గారు.





పబ్లిషర్సు:

పసుపులేటి వెంకట్రామయ్య & బ్రదర్సు,

బుక్ సెల్లర్సు, రాజమండ్రి.

Accn. 1349

## పూర్వకవుల పద్యకావ్యములు



# శృంగారనైషధము



శ్రీనాథుని ప్రణీతము రు 1—0—0

# బిల్హణీయము



చిత్రకవి సింగరార్యుని ప్రణీతము రు 0—8—0

# శశాంకవిజయము



శేషము వేంకటపతి విరచితము రు 1—0—0

# మొల్లరామాయణము



ఆతుకూరి మొల్ల ప్రణీతము రు 0—12—0

# పారిజాతాపహరణము



ముక్కుతిమ్మన విరచితము రు 1—0—0

---

కసుపులేటి వెంకటాద్రినయ్య అండ్ బ్రదర్సు, రాజమండ్రి

# శ్రీకృష్ణదేవరాయచరిత్రము.



గ్రంథకర్త:

## మద్దూరి శ్రీరామమూర్తిగారు.



పబ్లిషర్సు:

## పసుపులేటి వెంకట్రామయ్యా అండ్ బ్రదర్సు.

బుక్సెల్లర్సు, రాజమండ్రి.

మొదటికూర్పు 2000 ప్రతులు.

కాకినాడ.

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపబడినది.

1926.

 [వెల రు 1—0—0.

# పీఠిక.

భాషాభిమానులారా! ఆంధ్రలోకమున కత్యంతోపకారము నర్చి చిరకీర్తి నార్జించిన శ్రీకృష్ణదేవరాయల చారిత్రమును యదుత భక్తితో నొనర్చినట్లు వ్రాసి ఆంధ్రలోకమునకు సమర్పించితిని.

కృష్ణదేవరాయల జననమునుగూర్చి పెక్కురు పెక్కువిధము లుగా జెప్పుచుండిరిగాని యిదమిద్ధమని నిర్ణయించుటకు సరియైనయా ధారములు లభింపకున్నవి. అందుచే లోకమున వాడుకలోనున్న కొన్ని యభిప్రాయములనుమాత్రమే యొసంగియుంటిని.

విజయనగరమహారాజ్యము విస్తరించుటకును మహోన్నతస్థితికి వచ్చుటకును కారణభూతుడైన సాళువ తిమ్మమంత్రి (తిమ్మరుసు) సంగ్రహచరిత్రముగూడ వ్రాసియుంటిని.

రాయలకు సంస్కృతాంధ్రములయందు నపారప్రేమగలదని సూచించు కథలను గొన్నిటినిగూడ నొసంగియుంటిని.

ఇందు ప్రమాదజనితదోషము లనేకములున్నవి. పాఠకమహా శయులు నాతప్పులనుమన్నించి రాయంచచందమున యిందున్న గుణాంశమునే గ్రహింతురుగాక.

ఇట్లు
బుధజనవిధేయుడు.
వద్దూరి శ్రీరామమూర్తి.
గ్రంథకర్త.

కాకినాడ,
4-12-1926

# ప్రకటన.

ఈ గ్రంథము మదరాసు కాపీరైటు ఆక్టు ప్రకారము సర్వాధికారములును యీదిగువ సంతకము చేసిన మాకు చెందియున్నవి. కావున దీని నంతయుగాని కొంతగాని యెవ్వరును ముద్రింపఁగూడదు.

పసుపులేటి వెంకటాద్రిమయ్య అండ్ బ్రదర్సు,

బుక్ సెల్లర్సు, ఇన్నీసుపేట,

రాజమండ్రి.

# విషయసూచిక.




| | | |
|---|---|---|
| 1 | ఇష్టదేవతాప్రార్థనము | |
| | మొదటిభాగము. | |
| 2 | వంశచారిత్రము 1 భాగము | 1 |
| 3 | వంశచారిత్రము 2 భాగము | 7 |
| 4 | కృష్ణరాయుని బాల్యము | 12 |
| 5 | రాజకుటుంబ పరిస్థితులు | 13 |
| 6 | సైన్యపరిస్థితులు | 14 |
| 7 | ప్రజాపరిస్థితులు | 15 |
| 8 | దేశపరిస్థితులు | 15 |
| 9 | వీరనరసింహునికోర్కె | 16 |
| 10 | తిమ్మరుసు యాలోచనము | 18 |
| 11 | కృష్ణదేవరాయల పట్టాభిషేకము | 19 |
| 12 | ఒకకథ | 21 |
| 13 | చిన్నాదేవి | 22 |
| 14 | తిమ్మరుసు చారపద్ధతి | 25 |
| 15 | కృష్ణదేవరాయల వివాహములు రుచీదేవి | 27 |
| 16 | వరదరాజమ్మ | 33 |
| 17 | సమాగమము | 41 |
| 18 | తిరుమలదేవీ వివాహవృత్తాంతము | 42 |
| | రాయలవివాహములగూర్చి విదేశీయుల యభిప్రాయములు | 45 |
| | పూర్వదిగ్విజయయాత్ర | 46 |
| | రాయచూరుముట్టడి | 50 |
| | తిమ్మరుసు మంత్రిచరిత్రము | 51 |

## ద్వితీయభాగము.


| | | |
|---|---|---|
| 1 | విద్యాగోష్ఠి | 55 |
| 2 | కరిరాజవరదుఁడు | 59 |
| 3 | కవిత్రయవిమర్శనము | 60 |
| 4 | సమస్య | 61 |
| 5 | స్వర్ణయోగచింతామణి | 62 |
| 6 | పాతివ్రత్యప్రదర్శిని | 67 |
| 7 | సమస్య | 69 |
| 8 | రాధామాధవకవి | 69 |
| 9 | పారిజాతాపహరణము | 70 |
| 10 | ధూర్జటికవి | 73 |
| 11 | అల్లసాని పెద్దనామాత్యుఁడు | 74 |
| 12 | కవిత్రయము | 76 |
| 13 | పాండవప్రశంస | 77 |
| 14 | పిల్లిగొడనరస రాజు | 78 |
| 15 | రత్నముల పళ్లెరము | 81 |
| 16 | బొడ్డుచర్ల తిమ్మన చతురంగము | 82 |
| 17 | ప్రాణము | 84 |
| 18 | వర్ణభేధము | 85 |
| 19 | నాడులభేదము | 88 |
| 20 | వసుచరిత్రమును కృతిగొననీకుండుట | |
| 21 | పాకటికావలి తిమ్మన | |
| 22 | అప్పయదీక్షితులు | |
| 23 | చీనాంబరములు | |
| 24 | రామకృష్ణుఁడు | |

| | | |
|---|---|---|
| 25 | చిత్రలేఖనము | 93 |
| 26 | పిల్లిపిల్లను బెంపనిచ్చుట | 95 |
| 27 | లాభములో చెఱిసగము | 96 |
| 28 | శ్రీకృష్ణదేవరాయ విరచితగ్రంథములు | 97 |
| 29 | అముక్తమాల్యద | 99 |
| 30 | రాజశివి | 100 |
| 31 | విమర్శనము | 100 |
| 32 | నల్లకుక్కను తెల్లకుక్కనుగా జేయుట | 101 |
| 33 | కృష్ణదేరాయునికి కల్గినశాపము | 103 |
| 34 | అముక్తమాల్యదలోని పద్యములు | 103 |
| 35 | జాంబవతీపరిణయము | 104 |
| 36 | అముక్తమాల్యదలోని రాజనీతి | 105 |
| 37 | తిమ్మరుసు | 106 |
| 38 | శ్రీకృష్ణదేవరాయల నిర్యాణము | 107 |
| 39 | కొన్నిపద్యములు | 108 |
| 40 | శాసనములు | 112 |
| 41 | మూడుశాసనములు | 117 |
| 42 | అనుబంధము | 120 |




శ్రీ

# ఇష్టదేవతాప్రార్థన.



చ. సనకసనందనాది ముని । సత్తములెల్ల భజించుచుండఁ బా
వనమగు శేషతల్పమున । భామినిఁగూడి పరుండి లోకముల్
మనిపి వినోదలీలల సు । మానుషుఁడై నటియించు పద్మ నే
త్రుని పదపద్మరాజముల । రూఢి భజింతు నభీష్టసిద్ధికిన్.

అని యిష్టదేవతాప్రార్థన మొనరించి,

తే. గీ. ధరణికంటెను మిగుల శాం । తత వహించి
యష్టకష్టంబులకు నోర్చి । యనుపమాన
మైన ప్రేమను బ్రోచిన । మాత ఋణముఁ
దీరిచి, తరించినట్టి, కు । మారుఁ డెవఁడు ?

తే. గీ. అట్టి ఋణమందు లవలేశ । మైనఁ దీరు
ననుచు నాతల్లి నరసమాం । బను ముదమున
వినుతిచేసి, నమస్కృతుల్ । వేయుచేసి
"కృష్ణరాయుల చరిత" మం । కిత మొనర్తు.



శ్రీరస్తు.

# శ్రీకృష్ణదేవరాయచరిత్రము.

## ప్రథమ భాగము

### వంశచారిత్రము—1

ఏమహాత్ముఁడు తన యోగ్యతావిశేషముచేతను, బుద్ధిప్రభావముచేతను, కర్ణాటసామ్రాజ్యంబున కత్యంతోపకార మొనర్చి చిరకీర్తి నార్జించి "శ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరురాయరగండ, అరిరాయవిభాళ, భాషిగెతప్పు రాయరగండ, అష్టదిక్కులరాయ మనోభయంకర పూర్వ దక్షిణ పశ్చిమ సముద్రాధీశ్వర, యవనరాజ్యసంస్థాపనాచార్య, గజపతివిభాళ, శ్రీవీరప్రతాప" యను బిరుదములనంది జగన్నుతి కెక్కియుండెనో యా శ్రీకృష్ణదేవరాయుని పవిత్రచారిత్ర మెఱుఁగుటకు ము న్నాతనివంశీయుల చారిత్ర మించుక ముఖ్యముగా మన మెఱుంగవలసి యున్నది.

కృష్ణదేవరాయలు కృతిగొన్న స్వారోచిషమనుసంభవమున దల్లసాని పెద్దనామాత్యుఁడు కృష్ణదేవరాయలవంశమును గూర్చి యిట్లు వచించియుండెను.

తే. గీ. వాని వంశంబు తుళువాన్వ । వాయమయ్యె
నందు బెక్కండ్రు నృపు లుద । యంబు నొంది
నిఖల భువన ప్రపూర్ణ ని । ర్ణిద్రకీర్తి
నధికులైరి తదీయాన్వ । యమున బుట్టి.

మను. ఆ. 1. ప. 22

ఈతుళువాన్వయులు చంద్రవంశజు లనియు నం దుదయించిన తిమ్మరాజు కుమారుఁడైన ఈశ్వర రాజు దిగ్విజయ మొనర్చియుండెనని వరాహపురాణమునందును, మనుచరిత్రమందును నిట్లు వర్ణింపబడి యుండెను.

సీ. ఉదయాద్రి భేదించె । హుత్తర నిర్జించె
గండికోటపురంబు । గదలద్రవ్వె
బెనుగొండ సాధించె । బెగ్గులూరు హరించె
గోవెల నెల్లూరు । గుంటుపరచె
గుందాణి విదళించె । గొడుగుచింత జయించె
బాగూరు పంచము । పాడుచేసె
నరుగొండ పెకలించె । నామూరు మర్దించె
శ్రీరంగపురమును । జారి సమరె
రాయచౌహత్త మల్లధ । రావరాహ
మోహన మురారి బర్బర । బాహుసాళ్వ
నారసింహప్రతాప స । న్నహనుఁడగుచు
విశ్వహితకారి తిమ్మయ । యీశ్వరుండు.

వ. పు. ఆ. 1. ప. 30

సీ. నిజభుజాశ్రితధారు ।ణీ వజ్రకవచంబు
దష్టభుజంగాహి । తుండితుండు

వనజేక్షణా మనో । ధనపశ్యంతోహరుం
డరిహంస సంపద । భాగ్యమంబు
మార్గణగణపిక । మధుమాస దివసంబు
గుణరత్నరోహణ । క్షోణిధరము
బాంధవ సందోహ । పద్మినీహేళి
కారుణ్య రసనిమ్న । గాకళత్రుఁ
డనజగంబుల మిగులఁ బ్రె । ఖ్యాతిగాంచెఁ
ధరణి ధవదత్త వివిధోప । ధావిధాన
మార్జిత శ్రీవినిర్జిత । నిర్జరాల
యేశ్వరుఁడు తిమ్మభూపతి । యీశ్వరుండు.

మను. ఆ. 1. ప. 26

మరియును పారిజాతాపహరణమున ముక్కుతిమ్మనార్యుఁడు—

ఉ. తానసహృత్తికేళు సత । తంబును నుర్విఁ బుగాఁడు పౌరుషం
బేమియు వెత్తిగాను తన । కెండుచు బైనుఱ రాజు లేఁడు సం
గ్రామములోన నొక్కఁడగు । గాసికి నాసి దొలంగఁ డీశ్వర
క్ష్మామహిళా మనోహరుని । సాటియె యీశ్వరుఁ డెన్ని భంగులన్.

అని వర్ణించి యున్నాడు

కం. ఆ యీశ్వర నృపతికిఁ బు
ణ్యాయత మతియైన । బుక్కమాంబకుఁ దేజ ;
స్తోయజహితు లుదయించిరి
ధీయుతులగు నారసింహ । తిమ్మనరేంద్రుల్.

మను. ఆ. 1. ప. 27

ఈ నరసరాయలు సాళ్వనరసింహభూపాలుని మంత్రివర్గము లోనివాఁడు. నాదెళ్ళ చిట్టిగంగామాత్యుని ప్రోద్బలంబున తిమ్మరాజును వాతని తనమంత్రిగా గైకొని యాతనిచే తన యాంతరంగిక

మిత్రునివోలె బంధునివోలె గౌరవించుచు నాతని యిష్టానుసారము గనే నరసరాయలు వర్తించుచుండెను. చిట్టిగంగనామాత్యుఁడు గతించి నందున తుళువనరసరాయలే ప్రధానమంత్రి యయ్యెను.

అక్కాలమున కర్ణాట సామ్రాజ్యమునకు మూలపీఠమన దగు విజయనగరము (విద్యానగరము) విరూపాక్షదేవరాయలను వాతని పరిపాలనలో నుండెను. విరూపాక్ష దేవరాయలు స్త్రీలోలతావ్యామోహమునఁ బడి యంతఃపుర స్త్రీలతోడను, వేశ్యాంగనలతోడను, గాలయాపన మొనర్చుచు రాజకార్యముల యోచింపక, సభారంగమున దర్శనమీయక తనయిచ్చవచ్చినట్లు ప్రవర్తింపజొచ్చెను. ఈతఁ డిట్లు నాలుగువత్సరములు మాత్రమే (1486-1490) వరకు రాజ్యపరిపాలన మొనరించెను.

విజయనగర మీతని పరిపాలనలో నుండగా నశ్వపతులును, గజపతులును తమతమసైన్యముల వృద్ధిచేసికొనుచుండిరి. ఈసమయమున తిమ్మరుసు దేశపరిస్థితుల చక్కఁగ నాలోచించి తన యధిపుఁడైన తుళువనరసరాయునికడ కేగి "మహామాత్యపుంగవా! విజయనగరపు రాధీశ్వరుని చర్యలు తను రెఱుఁగనివికావు. ఆతఁడు రాజ్యమును లెక్కగొనక స్త్రీలతోడిదే లోకమనుకొని యిచ్చవచ్చినట్లు మెలంగుచున్నాడు. కర్ణాటరాజ్య మాక్రమించుకొన వేచియున్న గజపతు లీసమయమున విజయనగరమును వశపరచుకొనిన మనరాజ్యమునకు క్షేమముగాదు. వారలు విజయనగర మాక్రమించినపిదప వారలఁ బో ద్రోలుట మనకు సాధ్యముఁగాదు. ఈసమయమును వృథా బోనీయక మనమే విజయనగర మాక్రమించుకొనుట లెస్స. లేకున్నచో మనకును మన సామ్రాజ్యమునకుఁగూడ ముప్పుగలుగవచ్చును. విజయనగర మాక్రమించుట నిముసమాత్రమున యుద్ధము లేకుండ జరుగగలదు. ప్రజలందరును విరూపాక్షదేవరాయలను ద్వేషించుచుండిరి. ఆలోచించి

కార్యమునకుఁ గడంగు టుత్తమ" మని చెప్పెను. నరసరాయలును దీర్ఘముగా నాలోచించి తిమ్మరుసు ప్రతిభకు సంతసించి నరసభూపాలుని యనుమతిపై విజయనగర మాక్రమించుటకు బయలుదేరెను.

విరూపాక్షదేవరాయలు ప్రపంచమున జరుగుచున్న మార్పుల గణింపక, దివారాత్రములను భేదముల పాటింపక దినంబుల నిముషములట్లు స్త్రీలతో పాచికలాడుచు వేగించుచుండెను. ఒకనాడు విరూపాక్షదేవరాయలు వేశ్యలతో మెలంగు నవసరమున నొక్కచారుఁ డరుదెంచి వినమ్రుడై నరసింహదేవరాయలు విద్యానగరమును సైన్యముతో ముట్టడింపనున్నాడని యెఱింగించెను. సమయమెఱుగక లోనికి వచ్చితివేలనని యారాయలు వానిపై కోపించి యురిదీయించెను. ఇయ్యదియెఱింగి పౌరులెవ్వరును నరసరాయుని నెదుర్కొనరైరి. నరసరాయలనివార్యుడై కోట ప్రవేశించెను. అంతటనైనను విరూపాక్షదేవరాయలు తనస్త్రీలోలతావ్యామోహనిద్రనుండి మేల్కొనడయ్యెను. కొన్ని నిమేషములకు నరసరాయ లంతఃపురమును ముట్టడింప యందలి స్త్రీజనంబు లొక్కపెట్టున గోలపెట్టిరి. స్త్రీల యాక్రందనధ్వనులు చెవిసోకినంతనే రాయలు తనకు రాగల ముప్పునెఱింగి రహస్యద్వారమున పారిపోయి ప్రాణముల దక్కించుకొనెను.

తిమ్మరుసు బుద్ధిప్రభావమున సంపాదింపబడిన యీ విద్యానగరరాజ్యము సాళ్వభూపాలుని వశమయ్యెను. ఈతఁడు 1490 లో పట్టాభిషిక్తుడై 1495 వఱకును పాలన మొనరించి లోకాంతరగతుఁడయ్యెను.

సాళ్వనరసింహభూపాలుఁడు తనకుమారులగు తిమ్మరాజును నరసింహరాజును నరసరాయల కప్పగించి తనయనంతరము తన జ్యేష్ఠకుమారుఁడగు తిమ్మరాజునకుఁ బట్టముగట్టవలెనని నియోగించెను. నరస

రాయలు ప్రభునాజ్ఞమై తిమ్మరాజునకుఁ బట్టాభిషేక మొనరించి, రాజ ప్రతినిధియై పాలించుచుండెను.

ఇట్లుండగా నొక్కదండనాథుఁడు విజయనగరరాజ్యమును వశ పరచుకొనుట కువ్విళ్ళూరుచు, తనకోర్కె కొనసాగకుండ తుళువనర సరాయ లడ్డుగా నిలచియున్నాడని తలచి యాతనిని మంత్రిపదవిలో నుండి తొలగింపవలయునని యత్నము లొనరించుచుండెను.

ఇట్లుండగా నొక్కనాటి యుదయమున తిమ్మరాజు శయ్యపై నలికిఁబడియుండెను. ఎవ్వరా శయనాగారము ప్రవేశించి యీ యకా ర్యమొనర్చియుందురా యని నరసరాయలు మున్నగువా రాలోచించు చుండిరి. ఇంతలో జనులలో గొందఱికి నరసరాయలపై ననుమానము న్నట్లు తెలియవచ్చెను. అప్పుడుతిమ్మరుసునరసరాయలతో నిట్లనియెను. "జరిగినదానినిగూర్చి చింతించుట పురుషలక్షణముగాదు. కాన నాపల్కు లాలించి సాళ్వనరసింహభూపాలుని ద్వితీయపుత్రుఁడగు నరసింహరా యుని సింహాసన మెక్కించినగాని మనపైఁగల యపకీర్తి పోఁజాలదు" ఈ వాక్యములాలించి యందలి సత్యమును గుర్తెఱిఁగి నరసింహుని సింహా సనముపై గూరుచుండబెట్టెను.

దండనాథుఁడు గహస్యముగా బాలరాజును జంపి యానేరమును నరసరాయలపై మోపయత్నించి విఫలమనోరథుఁడై వేరుమార్గమున కార్యమును సాధింపవలయునని తలపోసి నరసింహరాజుతో మైత్రి సం పాదించి నరసరాయపై లేనిపోని నేరముల జెప్పుచు నరసింహరాజు నకు నరసరాయలపై క్రోధము పుట్టింపనెంచెను. ఈసంగతి గనిపెట్టి బాలరాజును (నరసింహుని) నరసరాయలు పెక్కువిధముల మందలిం చెను గాని లాభ మిసుమంతయు లేకపోయెను. అంత నరసరాయు లా కస్మికముగా సేనను గూర్చుకొని కోటను ముట్టడించెను.

ప్రయత్నములేమియు జరుగనందున కోటలోని వారెవ్వరును యుద్ధమునకు సంసిద్ధులై యుండకుండుట చేతను- నరసరాయలసైన్యమపారముగా నుండుటచేతను బాలరాజు కాళ్ళబేరమున కరుదెంచెను. నరసరాయలు కోటలోని కిట్లువార్తపంపెను. "నీస్నేహితుఁడైన దండనాథుని జంపి యాతనిశిరము కానుకగా బంపిన ముట్టడి నిలిపెదము. లేనిచో నీదండనాథుని బాహుపరాక్రమము జూడక విడిచిపెట్టము."

ఆవార్త నాలకించి బాలరాజు దండనాథుని జంపివైచెను. నరసరాయలు ముట్టడిమాని కోటలోనికేగి బాలరాజుతో సఖ్యమొనరించుకొనెను.

పిమ్మట కొన్నిదినంబులకు నరసరాయలు నరసింహరాజును పెనుగొండకు బంపి కొండమరెడ్డి యనువానిసహాయమున నరసింహరాజును జంపించి స్వతంత్రుఁడయ్యెను. ఇంతటినుండి తుళువవంశీయులు విజయనగరరాజ్యమును పరిపాలింప దొడఁగిరి.

## వంశచారిత్రము-2

1495వ సంవత్సరమున విజయనగరమున పట్టాభిషిక్తుడయ్యెను. కతిపయదినములకుఁ బిమ్మట దిగ్విజయ మొనర్చి పెక్కురు రాజుల వశపరచుకొనెను. ఈతని దిగ్విజయమునుఁగూర్చి ముక్కుతిమ్మనామాత్యు డిట్లని చెప్పియుండెను.

సీ. కుంతలేశ్వరుఁడు చి । క్కువడంగ విద్యాపు
రంబు గైకొని నిజ । ప్రౌఢి నెఱపె
బారసీకునకు దు । ర్భరమానవత్వంబు
దొలగించె మానవ । దుర్గసీమ
జోళవల్లభునకు । సురవధూమధురాధ
రములిచ్చి మధురాపు । రంబుగొనియె

శ్రీరంగపట్టణ । సీమ ఖడ్గనటీవి
నోదంబు హైసణేం । ద్రులకుఁ జూపె
నతఁడు నుతికెక్కె హైమసే । త్వంతరాళ
కలితషోడశదాన వి । ఖ్యాతయశుఁడు
మండలీకర మేఘమా । ర్తాండ బిరుదుఁ
డీశ్వరాధిపు నరసప్ప । ధీశ్వరుండు.

పారి ఆ. 1. ప. 13

ఈతని కీర్తిప్రతాపంబులగూర్చి యల్లసాని పెద్దనకవీంద్రు డిట్లు వ్రాసియుండెను.

సీ. అంభోధి వసన వి । శ్వంభరావలయంబు
దనబాహుపురిమర । తకము జేసె
నశ్రాంత విశ్రాణ । నాసార లక్ష్మికిఁ
గవికదంబము జాత । కములఁ జేసె
గకుబంత నిఖలరా । ణ్ణికరంబు జరణమం
జీరంబు సాలభం । జికల జేసె
మహనీయ నిజవి । నిర్మల యశస్సరసికి
గగనంబు కలహంస । కంబుఁ జేసె
నతిశిత కృపాణ కృత్తమ । త్తారివీర
మండలేశ సకుండల । మకుటనూత్న
మస్త మాల్యపరంపరా । మండనార్చి
తేశ్వరుండగు నారసిం । హేశ్వరుండు.

మను ఆ. 1. ప. 30

తుళువనరసరాజున కిరువురు భార్యలని మనుచరిత్రమునందును పారిజాతాపహరణమందును నిట్లు పేర్కొనబడియుండెను.

తే. ఆనరసింహ పతిసుండు తి । ప్పాంబవలన
నాగమాంబికవలన నం । దనుల గాంచె

*    *    *    *    *
*    *    *    *    *

మనుచరిత్ర ఆ. 1. ప. 31

కం. ఆనరసమహీమహిళా
జానికిఁ గులసతులు పుణ్య । చరితలు తిప్పాం
బానాగాంబిక లిరువురు

*    *    *    *

పారిజాతాపహరణము.

ఇట్లు రెండుగ్రంధరాజములు సాక్ష్యమిచ్చుచున్నవి కాని నేటి పూరాణశకాబ్దములు 1537 హేవిళంబి సంవత్సరమున చిమారు మండలములోని నారాయణపురము నొక బ్రాహ్మణునకు దాన మొసంగుచు నచ్యుతదేవరాయలు వ్రాయించి యిచ్చిన తామ్రశాసనములోని యీక్రింది వాక్యముల వల్ల నరసరాయలునకు ముగ్వురు భార్య లుండినట్లు తెలియవచ్చుచున్నది.

శ్లోకములు:-తిప్పాజీ నాగలా దేవ్యో కేసల్యా శ్రీసుమిత్రయోః
జా తేశ్వర నృసింహేంద్ర కృష్ణరాయ మహీపతిః
అస్మాదో బాంబికా దేవ్యామచ్యుతే దోపిభూపతిః

ఇంతియేగాక పెక్కురు నరసరాయలున కిర్వురుపుత్రులేయని యభిప్రాయబడుచున్నారు.

నరసరాయలున కిర్వురుపుత్రులని మనుచరిత్ర మందిట్లు వ్రాయబడియుండెను.

తే. గీ. *    *    *    *
*    *    *    *

వీరనరసింహరాయభూ । విభునచ్యు
తాంశసంభవుఁ గృష్ణరా । యక్షితీంద్రు.

ఆ. 1 ప. 31

పారిజాతాపహరణమందునను,

క. వారలలోఁ దిప్పాంబకు
మారుఁడు పరిపంథి కంధి । మంథాచలమై
వీరనరసింహరాయఁడు
వారాశిపరీత భూమి । వలయంబేలెన్.

ఆ. 1. ప. 165

శా. * * *
* * ముదమందన్నాగమాంబాసుతుం
డారూఢోన్నతిఁ గృష్ణరాయఁడు విభుండై రాజ్యసింహాసనం
బారోహించె విరోధులుగ్రహనశై వారోహముంజేయఁగన్.

కృష్ణదేవరాయలు నాగమాంబాసుతుడని నిరూపించుటకు యింకను కొన్ని నిదర్శనములను పారిజాతాపహరణమందు నుండియు, మనుచరిత్రమునుండియు జూపెదను.

క. నాగాంబికా కుమారున
కాగమిగతాధునిక నృపాలభ్యాయశ
శ్శ్రీగలహస్తిత హిమగుది
శాగజతరుకటజనైల్య సంభారునకు.

పద్యములు. పారిజాత.

స్రగ్విణి. నాగమాంబి భూ । నారసింహాత్మజా.

... ... ... పారి. ఆ. 2 ప 195

మనుచరిత్రము.

పృథ్వి. సుధీమధుర వాక్సుధా । సుముఖ నాగమాంబాసుతా!

... ... ... ఆ. 4. ప 122

కం. నాగాంబా సుత జితకచ
... ... ... మను. ఆ. 5 ప 122

ఇట్టి నిదర్శనములు పెక్కులున్నను కృష్ణదేవరాయలు దాసీపుత్రుడను ప్రతీతి బ్రబలియున్నది. ఇట్టివాదమును బలపరచుట కొక్క కథయున్నది.

తుళువ నరసరాయలు బహిర్దేశమునకేగి మగిడివచ్చుచుండ నాతనికరంబులనున్న జలకలశంబున నొక్క పెద్దరిక్కవడియెను. అద్దానిని తనకరముతో మూసియుంచి తిమ్మరుసునకై వార్తబంపెను. తిమ్మరుసచ్చోటికరుదెంచినంతనే యాతని కీవర్తమానమంతయు నెఱిగించి కర్తవ్యమేమని ప్రశ్నించెను. అంతతిమ్మరసు, "దేవా! నక్షత్రములన్నియు పుణ్యుల తేజస్వరూపములనియు, వారిపుణ్యము క్షీణించుటతోడనే భూమిపై నరుల జన్మమొందుదురనియు ప్రతీతిగలదు. కావున తమరీయుదకమును గ్రోలి పట్టపుమహిషితో నుండుడు." అని విన్నవించెను.

నరసింహరాయలు తిమ్మరుసు చెప్పినట్లుగా తిప్పాంబయంతఃపురమునకేగెను. కాని యామె యలంకరించుకొనుచు యించుకాలస్యము జేసెను. చీరసింగారించుకొనుటతోడనే యూరుతెల్లవారిన దను సామెత యీమెపట్ల సార్థకమయ్యెను. ఇంతలో నరసరాయలు దిప్పాంబతో నరణపుదాసిగా నరుదెంచిన నాగమాంబను జూచి మోహించి మోహపరవశుడై యామెతో నిష్టాలాపసంభోగముల నెఱపెను. అంత నాగమాంబ గర్భముదాల్చి కృష్ణదేవరాయలను గనెను.

ఒకానొకచో నాగమాంబను నరణపుదాసిగా వర్ణించు నీకథ యెంతమాత్రము విశ్వసనీయముగాదనియు నాగమాంబ సాగివారి పుత్రిక యనియు వక్కాణింపబడియున్నది.

కృష్ణదేవరాయలు దాసీపుత్రుఁడనుటకీ క్రిందికథగూడ ననుశ్రుతముగానున్నది.

నరసరాయలభార్యలైన తిప్పాంబయు నాగమాంబయు నొకదినంబున కొండొకవిషయమును గూర్చి వాదించుకొనుచుండిరి. వాదన క్రమక్రమముగా పంతములోనికి దిగెను. కద్రూవినతలవలె వారిరువురును గెలుపొందినవారి కోడినవా రాఱుమాసములు దాస్యము చేయుటకు నిర్ణయించుకొనిరి. వాదములో నాగమాంబ యోడిపోవుట వలన తిప్పాంబకు దాసియయ్యెను. ఆకారణమున కృష్ణదేవరాయలు దాసిపుత్రుఁడని హాస్యముగా బల్కుచుండ నదియే సత్యముగా నిటీవలి వారు గ్రహించియుండిరి.

ఇందలి సత్యాసత్యములు పాఠకమహాశయులకే వదలి యింక నీతనిజన్మమును గూర్చి కొంతచర్చింతము.

కృష్ణదేవరాయ లెప్పుడు జన్మించియుండెనో తెలియరాకున్నది. కొందరు కొందరు చరిత్రకారు లీతనిజన్మమునుఁ గూర్చి వచింపక మానమూని యీతఁడు పట్టాభిషిక్తుఁడైనది మొదలు చనిపోవువరకుఁ గల కాలమును నిరూపించియుండిరి. మఱికొందఱు 1468_75 సంవత్సరముల మధ్య జన్మించియుండవచ్చునని వ్రాసియున్నారు. *

## కృష్ణదేవరాయుని బాల్యము.

కృష్ణదేవరాయలును, యీతని జ్యేష్ఠసోదరుడగు వీరనరసింహదేవరాయలును మహామాత్యపుంగవుఁడైన తిమ్మరుసుచేతనే విద్యాభ్యాస మొనర్చుచుండిరి. ఉభయులలోఁ గృష్ణరాయుఁ డధిక మేధాశక్తిసంపన్నుఁడగుటవలన నతిసూక్ష్మముగా విద్యల నేర్చుకొనుచుండెను. క్రమక్రమముగా నాయిరువురు రాజకుమారులును యాంధ్రమున

* అనుబంధము చూడుడు.

చక్కని పాండిత్యము సంపాదించి, సంస్కృతమున సమానప్రజ్ఞగల సంగీతము మున్నగు చిత్రకళల నభ్యాసమొనర్చుచుండిరి.

శాస్త్రములయందే గాక వారలు, స్వారిజేయుట, కత్తిద్రిప్పుట మున్నగు యుద్ధవ్యాపారముల గూడ చక్కగ నేర్చుకొని మిక్కిలి బలవంతులని పేరు వడసిరి.

ఇట్లుండగా తిప్పాంబ కృష్ణరాయునియొక్క గుణములుగూర్చియు యాతని ప్రజ్ఞాదికముల గూర్చియు విని యసూయజెంది తన కుమారుని రాజ్యము కృష్ణదేవరాయ లపహరింపచ్చునని భావించి, యాకృష్ణరాయునివలన నట్టిబాధ గలుగకుండ జేసికొను తలంపున కృష్ణదేవరాయలునకు విషమొసంగి చంపయత్నించెను. కాని దైవకృపచేతను, తిమ్మరుసుయొక్క బుద్ధిప్రభావముచేతను గృష్ణరాయుఁడా యాపదనుండి తప్పింపబడెను.

తిప్పాంబ మరల నొక్కపరి విషమిచ్చి చంపజూచెనుకాని యాదినమునఁగూడ తిమ్మరుసే యడ్డపడి యాతనిప్రాణముల గాపాడెను. తిమ్మరుసు గృష్ణదేవరాయుని తనుకన్నపుత్రుడని భావించి ప్రేమించి యాదరించి యాతనికి రాజనీతి దండనీతి మున్నగుశాస్త్రముల బోధించి ప్రజ్ఞావంతునిగా నొనర్చెను.

## రాజకుటుంబ పరిస్థితులు.

సవత్నులైన నాగమాంబాతిప్పాంబలు పరస్పరము ద్వేషించుచు మాటిమాటికిని కలహించుచుండిరి. వారల పరస్పరద్వేషముల వలన రాజునకుగాని రాజకుటుంబమునకు గాని యెట్టియపాయమును సంభవింపకుండ తిమ్మరుసు గాపాడుచుండెను.

ఇట్టిస్థితిలో నరసరాయల కుబ్బురోగము సంభవించెను. ఎందఱు వెజ్జు లెన్నిమందులొసఁగినను రోగము గుదురునట్లు దోచుటలేదు. తన

## శ్రీకృష్ణదేవరాయ చరిత్రము.

...ణకాలము సమీపించుచున్నదని యెఱింగి నరసరాయులు తన కుమారులఁబిల్వఁబంచి తనవ్రేలనున్న ముద్రికాయుంగరమును దీసికొనిన యాతఁడే రాజ్యపాలనమున కర్హుఁడని వచించెను. వీరనరసింహరాయులు ప్రయత్నించి విఫలమనోరథుఁడై సిగ్గున దూరముగాఁ బోయెను. కృష్ణదేవరాయలు సందేహింపక తండ్రియని సంకోచింపక యావ్రేలు ఖండించి యుంగరమును దీసుకొనెను. అంత నరసరాయులు కృష్ణదేవరాయలే తనయనంతము సింహాసన మాక్రమింపగలఁడని యెంచి యుండెను.

పై నుదహరింపబడిన కథ సత్యమనుటకు దగిన యాధారములు గానరావు. అందులకు విరుద్ధముగా వీరనరసింహదేవరాయులు సింహాసనమెక్కి పరిపాలించెను. నరసరాయులు గతించినపిదప 1504 మొదలుకొని 1509 వఱకును రాజ్యపాలన మొనర్చి యుండెను.

## సైన్య పరిస్థితులు.

నరసరాయలునకు కర్ణాటరాజ్యమునంతయు నేకచ్ఛత్రాధిపత్యము వహించి పరిపాలింపవలయునను కుతూహలము మెండుగా యుండెను. నరసరాయులు తన కోర్కెను తిమ్మరుసున కెఱిగింప యాతడిట్లనియెను. "అశ్వపతులను, గజపతులను గెల్వవలయుననిన యశ్వబలమును గజబలమును ముఖ్యముగా నుండవలయును. అశ్వపతులు గుఱ్ఱములకు గొప్ప వెలలొసంగుటచే నరబ్బీవర్తకులు వారల కమ్ముచుండిరి. వారికన్న మన మధికమూల్య మొసంగినచో మనకే వారు గుఱ్ఱముల విక్రయింతురు. అంత మనయశ్వసైన్య మభివృద్ధిజెందగలదు." ఈపల్కులనాలించి తమకొఱకై తెచ్చు యశ్వములు సముద్రముపై మరణించినను వానితోకల దెచ్చినచో వేయిరూప్యము లొసంగుదుమని ప్రకటించి యరబ్బీవర్తకులను గుఱ్ఱములను తమకే యమ్మునట్లు చేసికొనెను

తిమ్మరుసు గజబలమునుగూడ యభివృద్ధిపరచి దిగ్విజయమునకు సర్వమును సిద్ధము చేసెను కాని యాకస్మికముగా మరణించుటచే దిగ్విజయ మొనర్చుటకు వీలు లేకపోయెను.

ప్రజాపరిస్థితి:—విరూపాక్షదేవరాయల కాలమున మిగుల నొత్తిడిబడియున్న ప్రజలిప్పుడు హాయిగా జీవించుచు సుఖముగా గాలమును వెల్లడించుచుండిరి. సుఖమును చవిజూచి యుద్ధమనినను యంతః కలహములకును వెఱచుచుండిరి.

దేశపరిస్థితులు:—విజయనగరరాజ్యమునకు సమీపముననున్న భామినీరాజ్యమున నంతఃకలహములుద్భవించి యైదు భాగములుగా విడిపోయెను. నవాబు లెల్లప్పుడును కలహించుచుండిరి.

1 బీజపూరు 1489

2 గోలకొండ 1512

3 అహమదునగరము 1490

4 బీరారు 1484

5 బీడారు 1472

హసన్‌గంగుయును వానిచే నిర్మింపబడిన బహామినీ రాజ్యము పైనుదహరింపబడిన సంవత్సరములలో చీలిపోయి తమలోతాము ద్వేషించుచు కలహించుచుండిరి.

ఇంతియేగాక విజయనగరపురాధీశులతో రాయచూరు దుర్గమును గూర్చి పోరాడుచుండిరి.

ఈపరిస్థితులన్నియు గమనించి తిమ్మరుసు వీరనరసింహదేవరాయలును సింహాసనమెక్కించి కృష్ణదేవరాయుని సహాయపరిపాలకునిగా నియమించి తాను మంత్రియై వారల గాపాడుచు వ్యవహారములను జక్కబెట్టుచుండెను. వీరనరసింహదేవరాయ లుత్తరమునగల పుణ్యక్షేత్రముల దర్శించుచు బోయి ధిక్కరించిన సామంతుల వశముచేసికొ

నుచు యొక్క సంవత్సరముగడపి మరల రాజధానిజేరెను. కృష్ణదేవరాయలు దక్షిణమంతయు జయించి యన్న తీర్థయాత్రనుండి యరుదెంచిన పిదప రాజధాని ప్రవేశించెను.

## వీరనరసింహుని కోర్కె.

వీరనరసింహదేవరాయలను నొక్క కుమారుఁడు గలఁడు. ఆతఁడిప్పు డష్టవర్షప్రాయముగలవాఁడై యుండెను. వీరనరసింహ దేవరాయలు పట్టాభిషిక్తుఁడై నాలుగు సంవత్సరములైనఁ గాకముందే యాతని దేహమున క్రొండొకరుగ్మత ప్రవేశించెను. వీరనరసింహుఁడు తన యనంతరము రాజ్యము తన కుమారునకు లభింపదేమో యని మిక్కుటముగా భయపడుచుండెను.

వీరనరసింహుని భయము క్రమక్రమముగా నసూయగా పరిణమించెను. ఒక్కనాఁ డాతఁ డిట్లు తలపోయసాగెను. కృష్ణదేవరాయలు మిక్కిలి బలపరాక్రమముగలవాఁడు. మీదుమిక్కిలి జనుల ప్రోగ్గత్తుల గన్నవాఁడు. విశేషించి ఘటనాఘటనా సామర్థ్యముగల తిమ్మరుసు ప్రాపక మాతనికి గలదు వాయనంతరము నా కుమారుని వధించిగాని మఱేయితరవిధముగాగాని వదల్చుకొని కృష్ణదేవరాయ లాక్రమింపక మానడు. కృష్ణదేవరాయలు జీవించియేయున్నచో రాజ్యము నాకుమారునకు దక్కదు. నా కుమారునికి రాజ్యము లభించుటకు కృష్ణదేవరాయ లడ్డుగానిలచియున్నాడు. ఈతని వధించితీరవలయును. ఇక్కార్యమును సాధించుట కెవ్వరును సమ్మతింపరు. కాన ఎట్లైనను తిమ్మరుసు చేతనే కృష్ణరాయుని జంపింపవలయును.

ఇట్లు తలపోసి యొక్కభటునిజీరి తిమ్మరుసును దోడ్కొనిరమ్మని యాజ్ఞయిడెను. భటుడు వెంటనే నిష్క్రమించి యుత్తరక్షణముననే

మహామాత్య పుంగవునితో నచ్చటి కరుదెంచెను. తిమ్మరుసును గూడు చుండ నియోగించి భటుని బొమ్మని సెలవిచ్చెను.

తిమ్మరుసుకు తన మెడనుండు హారమొక్కటి యాతనికి బహుమానముగా నొసంగి యాతని గాంచి యిట్లనియెను. "అప్పాజీ! మేమెట్టిసమయమైన నెట్టి దుర్ఘటకార్యమైనను తమ సహాయమున నిర్విఘ్నముగా సాధించుచుంటిమి. నాతండ్రితాతలు సాధింపక విడిచిన రాయచూరుదుర్గమును సాధింపవలయునని యెంచియుంటిని. కాని యయ్యది నెరవేరకమున్నె నే నీలోకమును వీడుట నిక్కవమని తోచుచున్నది. కాన తమరు నాయనంతరమైనను రాయచూరు సాధింపవలయును. ఇన్నిదినములవలెగాక నేడు నాహృదయంబున బాధ యపరిమితముగా నున్నది. ఇంక నాయవసానము సమీపించుచున్నది. ఒక్క చిన్నికోర్కె యున్నది దానిని తప్పక యీడేర్తునని వచనమిచ్చినచో నెఱిగించెదను.

తిమ్మరు సాపల్కులాలించి తన మనంబున నిట్లు తలపోయసాగెను. "ఈతనికోరి కెద్దియైయుండును. ఈతఁ డింక రెండుమూడు దినములకన్న నెక్కుడుగా జీవింపడని తోచుచున్నది. తన కుమారుని విషయమై యుండునా? లేక- తిప్పాంబవలె యీతనికిగూడ గృష్ణరాయుని పై ద్వేషభావ మంకురించినదా! ఛీ! యిట్టి యకార్యమున కీతఁడొడంబడునా?" ఇట్లు తలపోసి భూమీశునితో "దేవా! తమకొఱ కే కార్యమైనను వెనుకంజవేయక యొనరించి తమయభిమతమును దీర్చెదను."

తిమ్మరుసు పల్కులాలించి భూకాంతుఁడు కొంత దిటవుబూని మెల్లనలేచి తిమ్మరుసును సమీపమునకు బిలచికొని యాతనితో నిట్లని చెప్పదొడగెను. "అప్పాజీ! కృష్ణదేవరాయల యునికి నా కుమారునకు క్షేమముగాదను భయమున్నది గాన యాతని నేత్రద్వయమును దీయించి

నేటరేపట జూపవలయును. ఇది నాయాన. మారాడక యట్లొనర్చు" డని యాజ్ఞాపించెను.

తిమ్మరుసు తనమనంబున నేమని యోచించెనో గాని యట్లనే యొనర్తునని వచనమిచ్చి గృహంబున కేగెను.

## తిమ్మరుసు యాలోచనము.

తిమ్మరుసు తన గృహమునందొక్క రహస్యాగారమున గూర్చుండి యిట్లని వితర్కించుకొనసాగెను. ఈకృష్ణదేవరాయుని పసితనమునుండియు కన్నకుమారునివలె పెంచితినే-విద్యాబుద్ధులు గరపితినే, తిప్పాంబ విషమిచ్చి చంపజూచినప్పు డడ్డుపడి గాపాడితినే- యట్టి యీకృష్ణరాయుని నేత్రముల నన్నేదీయింపుమని యాజ్ఞాపించుటలో నీతని యుద్దేశమేమిగా నుండనోపును- ఆతని యాజ్ఞ నిర్వర్తించి సింహాసనముపై నొక్క బాలుని గూర్చుండబెట్టినచో రాజ్యము నభివృద్ధి చేయుటకు వీలుండదే! ఇంతియెగాక నాగురుదేవుని యీప్సితమును నెరవేరజాలదు. ఆమహామహుడు తురుష్కులను కృష్ణదాటి రాకుండ గాపాడుమని నివేదించియుండెను గాన యీ వీరనరసింహుని కుమారుని పట్టభద్రునిగా నొనరించిన తురుష్కులు కృష్ణదాటివచ్చుటేగాక విజయనగరమును గూడ నాక్రమింపగలరు. ఇట్లు వితర్కించుచు కర్తవ్యమూహింపజాలక కృష్ణదేవరాయలను బిలచి యాతనితో నిట్లనియెను. "నాయనా! కృష్ణదేవరాయా! వింటివా! నీయన్నగారి వాక్యములు. నీకన్నుల పెరికించిచూపుమని నాకాజ్ఞాపించియున్నాడు. ఇంక కర్తవ్య మూహింపజాలకున్నాను."

ఈవాక్యము లాలించి కృష్ణరాయుఁడు వడుకుమేనితో గద్గదిక స్వరమున తిమ్మరుసు పాదములపైఁబడి "అప్పాజీ! నిష్కారణముగా

నా నేత్రముల నేల దీయించెదవు. ఇదివఱలో దిప్పాంబ విషము బెట్టి
చంప యత్నించినప్పుడు నన్ను గాపాడి నేడు నీవే నా నేత్రముల దీయ
నూహించుచుంటివా! పసితనమునుండియు నన్నతిగారాబమున బెంచి
పెద్దగాచేసి విద్యాబుద్ధులు గరపి నన్ననేక విధములుగా గాపాడిన నీవే
యిట్లొనర్చెదవా? నీవే నన్నధోగతి పాలొనరింతువా? తండ్రీ! నాకండ్లు
దీయింపకుము. నాకీ రాజ్య మగత్యము లేదు. రాజోద్యోగమును వలదు.
నాకండ్లు దీయింపక విడిచిన యేపరదేశమునకేని బోయి యచ్చట తల
దాచుకొని జీవింతును. తండ్రీ! అట్లు జేయుటకు వీలులేని యెడల నా
నేత్రముల దీయించుటకు మారుగా నా శిరచ్ఛేదన మొనరింపుము."
అని యాతని వేడుకొనుచున్న కృష్ణరాయుని తన పాదములనుండి లేవ
నెత్తి యాతని కన్నుగవనుండి కాల్వలై గండభాగములనింపు కన్నీటి
ధారల తన యుత్తరీయాంచల[illegible]డిచి "వత్సా! చింతింపకుము.
తిప్పాంబకౌటిల్యమునుండి గాపాడి నేనునీయన్నగారివాతిఁ ద్రోయుదునా!
భయంబుడిగి నాయింట ప్రచ్ఛన్నముగా దాగియుండుము" అని యభ
యమిచ్చి యాతని రహస్యముగా నొక్కచో దాచియుంచెను.

మరునాడు రహస్యముగా నొక్కయాడుమేక కన్నులను దెప్పిం
చి దానిని మరణశయ్యపై నున్న వీరనరసింహ దేవరాయలునకు
జూపి యాతని సంతుష్టిపరచెను. ఆతడును కృష్ణరాయలు మరణించె
నని భావించి తనకుమారుని తిమ్మరుసున కప్పగించి నిశ్చింతతో నసు
వుల విడిచెను.

## కృష్ణదేవరాయని పట్టాభిషేకము.

అన్న మరణానంతరము కృష్ణదేవరాయలు సింహాసన మాక్ర
మించుకొని తనతమ్ముడైన యచ్యుతదేవరాయలను అన్నగారికుమా
రుడైన తిరుమలదేవరాయలను బందెనుంచెను. ప్రజలెల్లరును కృష్ణ

రాయునిపై మిక్కుటమగు నభిమానము గలవారలగుటచే నెవ్వరును కృష్ణరాయుని నాటంకపెట్ట యత్నింపలేను. ఈస్థితిలో తిమ్మరుసు కృష్ణదేవరాయల యొక్క దయాళుత్వమును బ్రజలు బాగఁడుటకై యొక యుక్తిపన్ని కృష్ణదేవరాయలతో మంతనంబున నిట్లనియెను. "దేవా! తమసోదరులు మరణించుటకు మున్ను తనకుమారుని నాహస్తమున నుంచి నీకన్నపుత్రునిగ భావింపుమని యానతిచ్చెను. కాన తమరిట్లు తిమ్మదేవరాయలను చెరపట్టి యుంచుట భావ్యముగాదు. ఈకారణమున ప్రజలకు మనపై ద్వేషము గలుగవచ్చును గాన నాపలుకాలించి వారలను దుర్గాధీశులుగా నొనరించి దూరముగా బంపివేయుఁడు." అని బోధించుచున్న తిమ్మరుసు వాక్యముల కలరి కృష్ణదేవరాయలు సంతోషముతో యట్లనే యొనర్పవచ్చునని వారల నాఙ్ఞణమ బంధవిముక్తులజేసి దూరమున [illegible]ంపు దుర్గములు వారికొసంగి ప్రతినిధులుగా బంపివేసెను.

అనంతరము 1509 వ సంవత్సరమున ఫిబ్రవరి నెల నాలుగవ తేదీని కృష్ణదేవరాయలు విజయనగరమున పట్టాభిషిక్తుడయ్యెను. ఈతని పట్టాభిషేకమును గూర్చి కుమార ధూర్జటి యను కవిశిరోమణి యిట్లు వర్ణించియున్నాడు.

సీ. ప్రణుతింప నతఁడు తో । రణ గట్టుపరసీమ
లనురీతి నూత్నతో । రణము లెసఁగ
రిపుల ఖండించి న । తృ్కపఁ దత్సుతులనిల్పు
నట్లు ద్వారములందు । ననఁటులమర
విలిఖించునతఁడు ది । క్కుల జయస్తంభాళి
ననుమూడ్కి-జిత్తర్వు । హర్మ్యలమర
వెలయు నిట్లితని కీ । ర్తులు దిక్తటులనన్న
సరణిముత్తెపు ముగ్గు । జగ్గులమర

నభినవాలంకృత స్ఫూర్తి । నతిశయించె
నప్పురీరత్న మపుడు మ । హాద్భుతముగ
ప్రకట మండల శ్రీకృష్ణ । రాయనృపతి
శ్రీకరంబైన పట్టాభి । షేకవేళ.

పెక్కురు సామంతు లరుదెంచి రాయలునకు బహుమతుల నొసంగి యుండిరి. అందు.

1 శ్రీరంగ పట్టణమునుండి కుమార వీరశ్యామల రాయుఁడు
2 కందనోలినుండి ఆర్వీటి శ్రీరంగరాజు
3 నందవీటినుండి నంద్యాల నారపరాజు
4 ఆకువీటినుండి ఆకువీటి యిమ్మరాజు
5 గంటికోటనుండి పెమ్మసాని రామలింగన్న భూపతి
6 రావెల వైదతిమ్మరాజు
7 వెలుగోడునుండి వెలుగోటి తిమ్మభూపాలమౌళి

యనువారలు ముఖ్యులు.

## ఒక కథ

పట్టాభిషేకమునకు సర్వమును సమకూర్పబడి యుండెను. పురమునందు రాయలూరేగుటకు బయలుదేరుసమయ మాసన్నమయ్యెను. అంత తిమ్మరుసు కృష్ణరాయుని బిలచి నీతోనొక్క రహస్య మెఱిగింప వలయును రమ్మని యాతని నొక విజన ప్రదేశమునకు దీసికొనిపోయి ఎవ్వరును లేకుండుట జూచి తిమ్మరుసు తనసత్తువకొలది కృష్ణరాయుని చెక్కిట నొక్కదెబ్బ గొట్టెను. ఆయాఘాతమున కృష్ణరాయఁ డించుక మూర్ఛిల్లి కొన్ని నిమేషములకుఁ దెప్పరిల్లి తిమ్మరుసును తన్నెందులకు గొట్టెనో మెఱుఁగక - యేమని బల్కినను నేమిప్రమాదమో యని నిశ్చేష్టుఁడై యుండెను.

వెంటనే తిమ్మరుసాతనిఁ గౌఁగలించుకొని "నాయనా! నీశరీరము నొచ్చినదని నాపై గినియకుము. ఇట్టియకార్య మొనర్చుటకు సందేహించి కాలయాపన మొనరించితిని. ఇంక నుపేక్షించిన రాజద్రోహి నగుదునని సందేహించి నేఁడొనరించితిని" అని పల్కుచుండ కృష్ణదేవ రాయ లాతని పదంబులవ్రాలి! "అప్పాజీ! తండ్రి కుమారు నూరక శిక్షించునా! ఏదో మహానీతి నుపదేశింప దలచి యట్లాచరించితివి గాని నీకు నామీఁదకోపమా! ఇంతమాత్రి మెఱుంగలేనా" అని యాతని వినుతింపుచుండ తిమ్మరుసు "వత్సా! నీవచించినది నిక్కువము. నాకుఁదెలిసిన సర్వశాస్త్రములను నీకుదెల్పితిని గాని సహనమునుగూర్చి నీకించుకంతయును దెలిపియుండలేదు. సహనమెఱుఁగని భూపాలుఁడు జనులను క్రూరదండనముల పాలొనరించి యన్యాయముగా శిక్షించి ఘోరపాప మార్జించుకొనును. జను లాతనిపై ప్రేమనుంపరు. అట్టిభూకాంతుని రాజ్యము స్థిరకాలము నిలువజాలదు. ఆకారణమున నీకెఱుఁగ జేయవలసి వచ్చెను. నేడు దెలుపకున్న రేపటినుండి మేమెల్లరము నీయాన మెలఁగ వలసిన వారముగాని నీకు బుద్ధులు గరపువారముగాము గాన జరిగిన దంతయు మరచి, జనుల శిక్షించునపుడు నీవు నాకరపాతమున నెంతగా నొచ్చియుంటివో యంతగా జనులుగూడ బాధనొందుదురని తలంచి శిక్షింపుము. లెమ్ము పట్టాభిషేకమునకు బయలుదేరుమని బోధించి యాతని దోడ్కొని సభారంగమును ప్రవేశించెను.

---

## చిన్నాదేవి.

కృష్ణదేవరాయలున కిరువురు భార్య లుండియుండిరని పారిజాతాపహరణమందును, మనుసంభవమందును నిట్లు చేర్కొనబడి యుండెను.

కం. ఆవిభునన౦తర౦బ ధ
రావలయము( దాల్చెఁ గృష్ణ । రాయుఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియునుం దనకుఁ గూర్చు । దేవేరులగాఁ.

మను. ఆ. 1. ప. 33

కం. శ్రీవెంకటగిరివల్లభ
సేవాపరతంత్రహృదయ । చిన్నమదేవీ
జీవిత నాయక కవితా
ప్రావీణ్య ఫణీశ కృష్ణ । రాయమహీశా!

పారి. ఆ. 4. ప. 1

ఇట్లు గ్రంథములయందు దేవేరిగా వర్ణింపబడియుండెనుగాని పారశీక భాషనుండి యింగ్లీషులోని కిటీవల తర్జుమా చేయబడిన నూనిజ్ యనువాని వ్రాతలవలన చిన్నాదేవి వేశ్యాంగనా పుత్రికయని వర్ణింపబడి యుండెను. ఇందలి సత్యాసత్యములు పాఠకమహాశయులకే వదలి న్యూనిజు వ్రాతలను బలపరచుట కనువుగానున్న కథ నొక్కదాని నీ క్రింద బొందుపరచుచున్నాను.

కృష్ణదేవరాయలు చిన్నమదేవి యను వారాంగనామణితో పట్టాభిషేకమునకుఁ బూర్వమునుండియు మైత్రిగలిగియుండి యామెకై యొరుల కంటబడకుండ యర్ధరాత్రమున మారువేసమున నామె యింటి కేగి యిష్టాలాపముల మెలఁగి మరల కోడికూతకు మున్నె కోట జేరుచుండెడివాడు. అతిరహస్యముగా జరుగుచున్న నీ వ్యాపార మొక్కనికైననుఁ దెలియదు.

పట్టాభిషేక మైనపిమ్మటగూడ యథాప్రకారముగా చిన్నాదేవి గృహమున కేగుచుండెను. ఒక్కనాడు కృష్ణరాయలు చిన్నమదేవి గృహమును సమీపించుచుండగా తిమ్మరుసు కంటబడెను. తిమ్మరు

పాతని వెంటనంటి రాయలు సోపానము లెక్కుచుండ నాతనిని చేయి పట్టుకొని నిలిపి మారువేసమును దొలగించెను. అంత కృష్ణరాయలు తనరహస్యవర్తనము వెల్లడియైనదను సిగ్గున తలవాల్చుకొని నిలువఁబడియుండెను. అంత తిమ్మరుసు "అప్పా! యిట్టి యకార్య మొనర్చుట దగునా? అర్ధరాత్రిమున మూర్ధాభిషిక్తుఁడవైన నీవు- కర్ణాట సామ్రాజ్యరక్షణదీక్షాబద్ధకంకణుడవైన నీవు- యంతఃపురమునువీడి- తోడెవ్వరును లేకుండ- యిట్లొక్క వారాంగన పొందున కాసించి వచ్చుట భావ్యమా! ఇయ్యది నీ శత్రు లెఱిఁగినచో నిన్ను తుదముట్టింప యత్నింపరా! పరరాజు లాలించిన వారాంగనాలోలుఁడవని నీకు తమ కన్యల నిచ్చుట కంగీకరింతురా! మున్ముందు పురోభివృద్ధి జూచికొనక నీకు- నీ సామ్రాజ్యమునకు- నీ వంశమునకు- తుద కాత్మకుగూడ ముప్పుదెచ్చు తుచ్ఛసౌఖ్యమున కాసించి యిట్లొంటరిగా వచ్చుట తగునా? కృష్ణదేవరాయా నా మాటలకుఁ బ్రత్యుత్తర మీయవేమి?" అని మందలించుచున్న తిమ్మరుసునకు మ్రొక్కి కృష్ణదేవరాయలు "అప్పా! నే నొనర్చు కృత్యము మంచిదని చెప్పజాలను గాని నా కీమెయందున్న గాఢానురాగము నన్ను సంపూర్ణముగ తన వశము జేసికొన్నది. పూర్వమునుండియు మాయిరువురకును మైత్రిగలదు. దాన పట్టాభిషేకమైనపిమ్మటఁగూడ యీామెను, యీామె ప్రేమనుఁ మరువజాలక నిత్యమిట్లనే వచ్చుచుంటిని. ఈమెను జూడజాలక నే నొక్క నిముసమైనను మనియుండజాలను. నేను పట్టభద్రుడనైనచో నిన్ను దేవిగాఁ గైకొందునని యీామెకు వాగ్దాన మొనఁగియుంటిని. ప్రబలశత్రుజనమధ్యముననున్న నన్ను గాపాడి యీాయఖండరాజ్యమును సంపాదించి నాకర్పించినాడవో యట్లనే నా ప్రేమాకాంక్షిణియగు- నా ప్రేమైకనిలయమగు నా ప్రేమాస్వరూపిణియగు నిక్కాంతామణినిగూర్చి నాయానందసాగర మపారమగునట్లొనర్చి రక్షింపుము. లేకున్నచో నా మనో

హరినామమే దైవనామముగ స్మరించుచు కొలఁదిదినములలోననే జీవముల వాయుదును" అని చెప్పి యింకను జెప్పఁబోయెనుగాని గద్గదికవొడమి మాటలు తడబడుచుండుటచే చెప్పఁజాలక యూరక కన్నీరు విడుచుచు నిలచియుండెను.

ఇట్లు పల్కుచున్న రాయలనుజూచి తిమ్మరుసు చాలసేపాలోచించి కృష్ణరాయునికోర్కె కనుమతింపకున్నచో సామ్రాజ్యమున కెన్నియనర్థములు సంభవించునో యను భయమున యాతనితో నిట్లనియెను. "అప్పా ! నీ కోర్కె స్వల్పకాలములో నెఱవేర్చెదను. ముమ్ముందు స్వజాతికన్యను వివాహమైనపిదప నీమెనుఁగూడ నీవు పరిగ్రహింపవచ్చును. అంతదనుక నీ రహస్యవర్తనము మానుము." అని యాతని నూరడించి యంతఃపురమునకు దోడ్కొనిపోయి దిగవిడిచెను.

తిమ్మరుసు రాయల కోర్కెదీర్చుటకు సమ్మతింపకున్నచో కర్ణాటసామ్రాజ్యచారిత్రి మింకొక విధముగా మారియుండు నని యభిప్రాయ పడుచున్నారు.

---

## తిమ్మరుసు చారపద్ధతి.

అంతఃపురమునగాని కోటలోగాని యెట్టి కార్యము జరిగినను తిమ్మరుసునకు నిముషమాత్రమునఁ దెలియవచ్చుచుండెను. అందువలన కోటలోగాని యంతఃపురములోగాని కుట్రలుపన్నుటకు వీలేమాత్రము ను గలుగకుండెను. శత్రుజనుల రహస్యముల నెఱుంగుటకు వేనవేలు చారులు నియమింపబడియుండిరి. సర్వకాలసర్వావస్థలయందును కృష్ణరాయుల క్షేమమునకై పాటుపడుచు కంటికి రెప్పవోలె యుండి సామ్రాజ్యమున నెట్టికల్లోలములును సంభవింపకుండ తన బుద్ధిప్రభావమున గాపాడుచుండెను. ఎవ్వఁడేని సామంతుఁడు ప్రబలుఁడై యుండె

నని తెలియవచ్చుటయే తడవుగా నాతని సామదాన భేదదండములచే వశపరచుకొనుచుండెను.

కృష్ణదేవరాయ లొక్కనా డెవ్వరికిని జెప్పక పాదచారియై పట్టణము సందులబడి పోవుచుండెను. ఇంకను బాగుగా సూర్యోదయ ముగాలేదు. జనసంచార మిసుమంతయును లేదు. కాని చారులుమాత్రి మగోచరులై రాయల వెన్నాడుచునే యుండిరి. తన్నెవ్వరును వెంబడించుటలేదని తలంపోసి రాయలు విసవిస నడచి పట్టణమునకు దూరముననున్న యొక్క పాతదేవళమున కరిగెను.

అచ్చటి యర్చకులు రాయలును గుర్తించి యాతనికి పాదుకల నొసంగి ప్రసాద మొసంగిరి. దేవళములోనుండి వెలి కరుదెంచినప్పటికి తిమ్మరుసు ప్రత్యక్షమై కొంతసైన్యముతో నిలచియుండెను. రాయలు మనమున సంతసించి యించుక కోపము నటించుచు "యిచ్చటి కేల వచ్చితివి. ఇంతలో నాకేమి కీడుమూడునని వచ్చితి"వని తిమ్మరుసును ప్రశ్నించెను

"దేవా! తమ రొంటిగా నేగుచున్నారని విని శత్రు లెత్తిగి కీడొనరింతురేమో యని కొంతసైన్యము నాయత్తమై రమ్మని వార్త బంపి యద్దుదోవల యీ కొలదిమందితో దేవర దర్శనార్థ మరుదెంచితిమి" అనివిన్నవించి యాత డొంటివచ్చిన నెన్నియనర్థములుగలుగ గలవో సూచించి యూరకుండెను. ఆపల్కులకు రాయలు "అప్పాజీ! ఘటనాఘటన సమర్థులగు తమబోటి మహామాత్యపుంగవులు నన్ను తమ కన్నకుమారునివలె నరసి రక్షింపుచుండ నే నెట్లు ప్రవర్తించిన నేమి?" అని చిరునవ్వున సమాధాన మిచ్చి యాతనితో నిట్లనియెను. "అప్పా! నాకు గజపతులను- యశ్వపతులను జయించి వారల పోద్రోలి రాజ్యము నేకచ్ఛత్రాధిపత్యముగా నేలవలయునని యున్నది.

నా తాతతండ్రులు జయింపక విడిచిన రాయచూరుదుర్గమునుఁగూడ సాధింపవలయునని యున్నది. ఇందుల కేమిసాధన" మని ప్రశ్నించెను.

తిమ్మరుసు "ప్రభూత్తంసమా! నా గురుదేవుఁడగు నాదెళ్ళ చిట్టిగంగనామాత్యుఁడు తనయవసానకాలమున నన్నుబిలచి నాయనా! అశ్వపతులను గజపతులను కృష్ణదాటి రాకుండున ట్లొనరింపజూచి చేయజాలకపోతిని, యా కార్యమును నీవు దీర్తునని శపథమొనర్చిన గాని నా యాత్మకు సంతృప్తిలేదని నాచే శపథము చేయించుకొనెను. అప్పటినుండియు ననేకవిధముల యత్నించుచు సైన్యము నపారముగా జేర్చి యుంచితినిగాని కొంతకొంతమార్చి సంస్కరణ మొనరించినపిమ్మటగాని దిగ్విజయ మొనర్చుటకు వీలుండదు. అందులకుగాను నాకు రెండువత్సరములు గడువీయవలయును. ఈలోపున సైన్యమున మనకుఁ బ్రతిపక్షులుగానున్నవారల వెతకి దండించవలయును. మనము క్రొత్తగా సంపాదించిన యశ్వసైన్యమున కింకను తగినంత సామర్థ్యము చేకూరి యుండలేదు. కావున యీగడువులోన వార లశ్వశిక్షయందు ప్రవీణ్యులగుటకు నవకాశముండును. కనుక నేను జెప్పిన గడు వతిక్రమించిన పిదప దిగ్విజయ మొనర్ప బయలుదేరుట కెట్టియాటంకమును యుండదు" అని బోధించి యాతని సమ్మతిగొని తిమ్మరుసు రాయలను కోటకు దోడ్కొనిపోయెను.

---

## కృష్ణదేవరాయల వివాహములు.

### రుచీదేవి

కృష్ణదేవరాయలు పూర్వదిగ్విజయమునకు బయలుదేరెను. అనంత సేనాసముదయంబునకు తిమ్మరుసు మహామంత్రి సైన్యాధ్యక్షుఁడై యుండెను. ప్రప్రథమమున కృష్ణరాయలు తురకలపై దండువిడిసి వా

రల నుక్కడగించి జయలక్ష్మినిఁ జేపట్టి వినుకొండ బాలించుచున్న గజపతిని జయించుటకు తన సైన్యముల నడపెను.

చారులవలన యపారమగు సైన్యము గజపతికి సహాయ మొనర్పవచ్చు చున్నదని యెఱిఁగి తిమ్మరుసు కొంతసైన్యముతో వేరుమార్గమునఁ బోయి యీసైన్యమును నెదుర్కొని పోరాడుచుండెను. రాయలు వినుకొండదుర్గమారణ్యములలో మార్గములు గలుగజేసికొని వినుకొండ సమీపించి తిమ్మరుసు రాకకై వేచియుండెను. గతయుద్ధములలో చాలమంది గాయములనొంది యుండి పోరాడుట కశక్తివంతులై యుండిరి. సైన్యమునకు కావలసిన యాహారపదార్థములు వచ్చుమార్గములు శత్రుజనులచే నరికట్టబడియుండెను.

రాయలసైన్యము గొప్ప యుపద్రవమున చిక్కియుండెను. వేలకొలదులగు శత్రుసైనికులు వన బున మారువేసముల గుమ్మరుచుండిరనికూడ తెలియవచ్చెను. రాయలున కధైర్యముతోచి తన కిచ్చుట నపజయము సిద్ధించుట నిక్కమని తలంచి వాపోవుచుండెను

శత్రుసైన్యమును జక్కాడి తిమ్మరుసు వేరొకమార్గమున విశేషమగు తినుబండారములతో రాయలసైన్యమును గలసికొనెను. ఇంతలో గజపతికి సహాయమొనర్చుటకు 16 పాత్రు లనువారలు తమ సైన్యముతో వచ్చి చేరియున్నట్లు తిమ్మరుసు వేగులవాండ్రవలనఁ దెలసికొని వారల జయించుట దుర్ఘటమని తలంచి భేదోపాయమున వారలను గజపతి నుండి విడదీసినచో కార్యము సులభమగునని తలంచెను.

గజపతి సైన్యమున పదునార్గురుభటులు విలువగల పెట్టెలతో నెందులకో తిరుగుచుండిరి. వారల ననుమానించి గజపతి సైనికులు వారల బంధించి గజపతియొద్దకు గొనిపోయిరి గజపతి వారలయొద్దనున్న పెట్టెలను దెరచి యందున్న మణిహారములను జూచి వానిని వెలికిదీసి

నంతనే యడుగున లేఖలను జూచి వానిని స్వయముగా నిట్లు చదువుకొనెను.

సీ. శ్రీమతు కర్ణాట । సింహాసనాధ్యక్షుఁ
డగు కృష్ణరాయ ధ । రాధినాథు
డలపదాఱుగురు పా । త్రులకు సంప్రీతిబం
పిన సులేఖంబులు । మిమ్ము మునుపు
గజపతి రాష్ట్ర దు । ర్గవిశేషములనుండి
మెలపుగాఁ బలికిన । పలుకుబడుల
తీరువ్రాసితిరి మీ । కోరినట్లనె ఘనా
భరణదుకూలముల్ । బంపినార
మట్లనే రేపు జగడాని । కరుగుదెంచి
యట్లు చనుదెంచి మాచేతి । కతని మీరు
పట్టియిచ్చిన యపుడె మీ । పట్ల మేము
కొదువపడకుండ నడపించు । కొనెద మెపుడు.

"కృష్ణరాయవిజయము"

ఆ లేఖల జదువుకొని వారలబట్టి బంధింప నాజ్ఞయిడి, యొక్క-రహస్య మందిరంబున కేగి యిట్లు వితర్కించుకొన సాగెను. "నమ్మి స్వామిద్రోహ మొనరింప నిశ్చయించిన వీరల నేమనవచ్చును. వీరల నమ్మి యుద్ధమునకు దిగిన నాకపజయము మరణము సంభవించితీరును. కోరి మరణమును దెచ్చుకొనినట్లు స్వామిద్రోహులచే జంపింపబడుటయా! ఛీఛీ! ఎచ్చటనైన తలదాచుకొని సమయ మరుదెంచి నంతనే రాయలపై బడవలయును" అని తలచి యర్ధరాత్రమున కోటవిడిచి పారిపోయెను.

రాజు పారిపోవుటవలన పదునార్గురు పాత్రులును యుద్ధము చేయక వెడలిపోయిరి. సైనికులు నిరుత్సాహముజెంది యుద్ధము సేయు

మానిరి. తిమ్మరుసు కోటముట్టడింప రాయలతో జెప్పి గజపతి తల దాచుకొన్న స్థలంబున కేగి యాతనితో గృష్ణరాయుని యౌదార్యమును గురించి యాతనికి నచ్చజెప్పి రాయలతో సంధిజేసికొనునట్లు బోధించి రాయలయొద్దకు దోడ్కొనివచ్చెను

రాయలు సంధి కిచ్చగించి యాతని రాజ్య మాతనికిచ్చి బహుమానపురస్సరముగా నాతని బంపవలసినదని తగువారల నాజ్ఞాపించెను. గజపతి రాయలయౌదార్యమునకు సంతసించి యాతనికి తన కుమార్తె నిచ్చి పరిణయము గావించి సంబంధము చేసికొను టుత్తమమని భావించి యందుల కనుమతింపజేయుమని తిమ్మరుసును ప్రార్థించి కోటలోనికి వెడలిపోయెను.

తిమ్మరుసు కృష్ణరాయునితో ప్రస్తావించి గజపతి కిట్లని వార్త బంపెను. "మాకు గాబోవు మాతను జూచినపిమ్మట తమకోర్కె కనుమతించి ప్రధానకార్యము జరిగించుకొనవచ్చును" గజపతి యాలేఖను జూచి సమ్మతించి రాకుమారిని జూచుటకు రావచ్చునని వార్త బంపెను. నిర్ణీతకాలమునకుఁ గృష్ణరాయలును తిమ్మరుసును శిబిరమునుండి బయలుదేరిరి. రాయలు తాంబూలమందించు వానివలె తిమ్మరుసును వెంబడించెను. కతిపయనిమేషములకుఁ బిమ్మట వారిరువురును కోట ప్రవేశించి యంతఃపురములోనికి రాకుమారిని జూపించుటకు గొనిపోఁబడిరి.

రుచీదేవి చక్కగా నలంకరించుకొని సాక్షాత్కరించిన దివ్యాంగనవోలె తెరఁ దొలగించుకొని చేటికాద్వితీయయై ప్రవేశించెను. రాయలామె రూపంబున కత్యంతంబుగా నలరి తనవాల్చూపుల తనసమ్మతిని తిమ్మరుసున కెఱిఁగించెను. ఇంతలో రుచీదేవితోనున్న చేటిక రాయల కాలినున్న పచ్చలకడియమును జూచి రాయలని గ్రహించి రుచీదేవి

కెఱింగించెను. రుచీదేవియు కడియమునుజూచి సంశయాకులితచిత్తంబుతో లోనికి గిరుక్కున మరలిపోయెను.

తిమ్మరు సాసంగతిగనిపెట్టి యింతసున్న మేలవ్రాసితివని సేవకుని నిందించుచు పరుగుపరుగున సింహద్వారమునుదాటి తమకొఱకు వేచియున్న సైన్యములో గలసిపోయిరి. అంతఃపురస్త్రీలు రాయలు కోట దాటిపోకుండ నొనర్పవలయునని యత్నించి తలుపులు మూయుట కాజ్ఞయిడిరి. కాని రాయ లీవఱకే తప్పించుకొనిపోయినందులకు చాలగా చింతించిరి.

గజపతికోటలో నొక్కగజపతికి తప్ప తదన్యులకు రాయలతో సంబంధమొనర్చుట నిష్టములేకుండెను. రాయలు కులహీనుఁడనియు యాతనితో సంబంధము చేయవలదనియు రాణి మున్నగువారలు గజపతిని నిర్బంధించిరి. కాని లాభ మిసుమంతయును లేకపోయెను. గజపతి స్త్రీలొనరించిన యకృత్యమునకు వగచి కృష్ణరాయుని బ్రతిమాలుచు తనతప్పు క్షమించి వివాహమునకు రమ్మని వార్తబంపెను అందులకుఁ దిమ్మరుసు "తుళువవంశీయులకు బాకునకు బాసికముగట్టి వివాహముచేయు టాచార"మని వార్తబంపి యొక్కపురోహితునిచే బాకును బంపెను. వివాహము జరిగెను.

వివాహానంతరము రుచీదేవిని తగుపరిచారికలతో విజయనగరమునకు బంపిరి. పునస్సంధానమునకుఁ దగుముహూర్తము నిర్ణయింపబడెను. రుచీదేవిని చెలులెల్లరును నలంకరించుచుండిరి. అట్లలంకరించుచు నామెకు కులహీనుడైన రాయలతో గాపుర మొనర్పవలదనియు, యట్టివానితోఁ గాపుర మొనరించుటకన్న మరణమొందుటయే శ్రేయమనియు రాయలు గదిప్రవేశించినంతనే యాతని బాకుతో పొడిచి చంపవలయు ననియు బోధింపసాగిరి. ఆమెయు శయనాగారమునకు దోడ్కొని

పోయినపిమ్మట నొక్క చెలికత్తె యామెచీరపై గుప్తముగా నొక్క ఖడ్గమునుగట్టి “పరువుమర్యాదలుగల గజపతివంశమున నుద్భవించి వంశమర్యాదలకు విరుద్ధముగా నొక్కకులహీనునితో కాపుర మొనర్చుట కంటె పవిత్రమైనఖడ్గముచే చచ్చుట మిక్కిలి శ్రేయము” అని తమజనని తమకెఱిగింపమని నన్ను నియోగించెను. మీాద తమచిత్తమని వెడలి పోయెను.

కృష్ణరాయలు శయనాగారమును ప్రవేశించి కొన్నినిమేషముల పిదప వెలి కరుదెంచి ‘‘అప్పాజీ! ఈబాలిక పయోముఖవిషకుంభము వంటిది. తక్షణమ యామెను జనకునింటికి బంపివేయుము.” అని నియమించి వెడలిపోయెను. కృష్ణరాయలు రుచీదేవిని సమీాపించి కరము గ్రహించి నిండారుప్రేమతో దరికిజేర్చుకొనుచుండ చీరపైగుప్తముగా నున్న ఖడ్గము క్రిందకు జారిపడియెను. అంతఁ గృష్ణదేవరాయలు వెలి కరుదెంచి యప్పాజీకి యామెను బంపివేయుమని చెప్పి వెడలిపోయెను.

ఆమె స్తంభితయై కన్నీటిధారలు గండభాగమునింప నపారదుఃఖమున కుందుచు నోటమాట లేక యట్లనే నిలువబడియుండెను. తిమ్మరుసామెనుగాంచి తానుగూడ దుఃఖించి చేయునది లేక యామెకు రాయల వార్త నెఱిగించి ప్రయాణమునకు వలయు పరికరముల సమకూర్ప తగువారల నియోగించెను. కతిపయనిమిషములకు కొన్ని పల్లకులు కోటనుంటి వెడలిపోయెను.



# వరదరాజమ్మ

## ద్వితీయభాగము.

కృష్ణదేవరాయల సామ్రాజ్యపు సరిహద్దులయందున్న నొక్క గొల్లపల్లి సమీపముననున్న సాంద్రారణ్యమున నొక్క ప్రాసాదము నిర్మింపబడెను. అందొక్క లలనారత్నము నివాస మేర్పరచుకొని విరాగిణియై వర్తించుచుండెను. ఆ ప్రాసాదసమీపమున నెన్నియో పటకుటీరములు నిర్మింపబడియుండెను. అందు నిరంతరమును బ్రాహ్మణసమారాధనము జరుగుచుండెను. వాపీకూపతటాకములెన్నియో యీప్రాంతమునఁ త్రవ్వింపబడెను. ఈమె యచ్చోట ప్రవేశించినది మొదలా యరణ్యము సస్యయోగ్యమగునట్లు చేయుటకు యత్నములు జరుగుచుండెను. బీదసాదలెల్లరును సంతసముతోఁ బనిచేయుచు యామె దయకు పాత్రులగుచుండిరి.

ఈమె యొక గొప్ప తటాకము నిర్మించెను. ఆసంవత్సరమున వర్షము లమితముగా గురియుటచే కట్ట తెగి జలములు సస్యములను ముంపసాగెను. ఎందరెన్ని విధముల బ్రయత్నించినను గండి పూడ్చజాలకుండిరి. చిట్టచిగురునకు నిరువురు మనుష్యులు బలియై గండి ప్రవేశించినపిదప సామాన్యప్రయత్నమున గండి పూడ్చబడెను. ఆమె వారల మరణమున కెంతయో వగచి వారలపేరున రెండు గ్రామముల కట్టించెను. (పెదకంబము- చినకంబము.) దీన నామెప్రతిభ లోకవిదితమయ్యెను.

యథాప్రకారముగా నొక్కరేయి వరదరాజమ్మ తపస్సమాధిని చిరకాలము నిలచి యర్ధరాత్రిమున నొక కృష్ణాజినమున నించుక నిద్రించెను. ఆసమయమున నొక్క పాంథుఁ డాశ్రయాభిలాషుడై యామె పరున్నచోటి కరుదెంచెను. ఆసవ్వడికి మేలుకొని వరదరాజమ్మ యాతనిగుర్తించి సరగున లోని కేగి యాతనికి తగు పరిచర్య

లొనర్పవలసినదని తగువారల నియమించెను. ఇరువురు కాషాయాంబరధారిణులగు స్త్రీలు ప్రవేశించి యాతని నొక్కశయనాగారమునకుఁ దోడ్కొనిపోయిరి. అంత వారల కీక్రిందిసంభాషణ జరిగెను

పాంథుఁడు—నిబిడారణ్యమధ్యమున నీమె యిట్లు యోగినివోలె వర్తించుటకుగల కారణమేమి?

1 స్త్రీ—చెప్పుట కాజ్ఞలేదు.

2 స్త్రీ—తమకు పరిచర్య లొనర్పవలసి నట్లాజ్ఞగొని వచ్చియున్నాము. తమ రిందు శయనింపవచ్చును.

పాంథు—ఈమె పేరెవ్వరు?

స్త్రీ—వరదరాజమ్మ

పాంథు—నిర్వొరపడి మాటలాడజాలక యొక్క తల్పమున గూరుచుండెను.

స్త్రీ—అయ్యా! మాకుసెలవు. తమ హాయముగూడ జాగ్రత్తపరుపబడినది. అనిచెప్పి వారిరువురును నిష్క్రమించిరి కృష్ణరాయలు తన మనంబున నుద్భవించు నాలోచనాపరంపరల దేలుచు నిద్రరామిని జేసి యటునిటు జూచెను. తోడనే చకితుఁడయ్యెను. తనరూపపట మొక్క టతిచమత్కృతిగా నలంకరింపబడియుండెను. ఆపటమును నమీపించెను. అం దీక్రిందిశ్లోకపంచకముండుట జూచి యిట్లు చదువసాగెను.

శ్లో॥ చరన్వనాంతే నవమంజరీషు
నమట్పదో గంధఫలీమ జిఘ్రత్
సాకింనరమ్యా నచకిన్నరంతా
బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా॥
మాకింశుకప్రకటయాత్మ నిమేషమాత్రం
మన్నస్తకే విహరతీతి మధువ్రతోయం
కింమాలతీ విరహవేదన యా త్వదీయం

దృష్ట్వా ప్రసూనమచిరాదనలభ్రమేణ॥
భ్రమరభ్రమతా దిగంతరాళే
క్వచిదాస్వాదిత మీక్షితం శ్రుతం వా
వదసత్యమపాస్య పక్షపాతం
యది జాతికుసుమానుకారిపుష్పం॥
కుసుమ్మాని శిఖింతు నామచిత్రే
కతిచిత్కారు విశేషరూఢశిక్షాః
సురభిత్వమమూని కిం లభంతే
కిముచైతేషు రసంపిబంతి భృంగాః॥
కింమాలతీమ్లానయ వాంవిహాయ
చుచుంబ తుంబీ కుసుమం షడంఘ్రిః
లోకేచతుర్భిశ్చరణైః పశుస్స్యా
త్సషడ్భిరత్యర్థపశుర్నకింస్యాత్॥

(ఇతిశ్లోకపంచకం.)

అర్థములు:—నవనవోద్భూతప్రసూనమంజరుల నాస్వాదించి మధురసంబుగ్రోలు మధుకరంబేల యుపవనంబున గల సంపెగపూల దరిజేరదు. సంపెగపూవునందు గుణలోపమున్నదా? లేక మధుకరమునకు మధువుగ్రోలు శక్తిలేదా? గంధఫలియందు గుణమున్నను మధుకరమునకు రసగ్రహణపారీణత యున్నను ఈశ్వరాజ్ఞ బలమైయున్నది గాన మధుకరము గంధఫలిం జేరుటలేదు.

(2) ఓమోహనగపుష్పమా! తుమ్మెద నాపైననే వ్రాలుచున్నదని గర్వింపకుము. అయ్యది నిముషమాత్రము వలెకే! మాలతీవిరహవేదన భరింపజాలక జీవముల బాపికొననెంచి యెట్టినను నీపుష్పముల గాంచి విస్ఫోటకలగా భావించి నీపూవులపై వ్రాలినది. ఇంతమాత్రమున సంతసింపకుము.

(3) మధుకరమా! అన్నిదిక్కులను విహరించుదానవు గదా! జాజిపువ్వుముతో సమానమైన పుష్పమున్నదేమో పక్షపాతము మాని చెప్పుము.

(4) విశేషప్రజ్ఞావంతులగు కళానిపుణు లగువారలు పుష్పముల లిఖింతురు కాని మధుకరములు వానినుండి మధువు గ్రోలగలవా? వానికి సురభిత్వ ముండునా?

(5) మాలతీకుసుమమును విడచి యానవపూవు నాస్వాదించు మధుకరము పశువున్నర గదా! (నాలుగు కాళున్న పశువు. ఆరుకాళ్ళు గల మధుపము పశువున్నర యగు ననుట.)

"ఈమందిరమున నారూపపట ముండుటయందు వ్యంగ్యార్థమిచ్చుచున్న యీశ్లోకపంచక ముండుటచూడ కడుంగడు వింతగా దోచుచున్నది. ఇయ్యది యిచ్చోటనుంచి యిట్లలంకరించువా రెవ్వరుగా నుందురు" అని పెక్కువిధముల నాలోచించి యిదమిద్ధమని నిర్ణయింపజాలక తల్పముపై గూర్చుండి కొంతవడికి నిద్రించెను.

మరునా డుదయమున రాయ లామె కులగోత్రముల నెఱుంగుటకై చుట్టుప్రక్కలకేగి యందు ప్రయత్నించెను కాని యాతని కాకాషాయాంబరధారిణులు చెప్పిన దానికంటె నాతఁ డేమియును తెలిసికొనజాలక పోయెను. ఒక్కతటాకమునఁ బ్రతిష్ఠించుటకై చెక్కింపబడిన శిలాస్తంభమున నున్న వ్రాత నిట్లు చదువసాగెను.

ఇయ్యది శ్రీమన్మహా రాజాధిరాజ రాజపరమేశ్వర మూరు రాయరగండ.........బిరుదాంకితులగు శ్రీ వీరప్రతాప శ్రీకృష్ణ దేవరాయల పాదభక్తురాలు—అని చెక్కింపబడియుండెను. దానిగాంచి యధికాశ్చర్యమున తనమనంబున నేమేమియో చింతించుకొనుచు విజయనగరమున కేగెను.

కృష్ణదేవ రాయుని ద్వితీయ భార్యయగు తిరుమలదేవి రుచీదేవి వృత్తాంత మంతయును సంపూర్ణముగా నెఱింగి యామెకు కృష్ణరాయుని పైగల యభిమానము, ప్రేమ మున్నగువానిని గూర్చి విని యామెను భర్తతో గలుపవలెనని నిశ్చయించుకొని కృష్ణ రాయ లధిక సంతోషస్వాంతుఁడై యున్న యెడ నాతని దరిజేరి వినయ మొల్క నిట్లు ప్రశ్నించెను. "దేవా! తమరు నాకొక్క దినంబున నన్ను బోలిన చరిత్రగల యొక్క రాజపుత్రికను పరిత్యజించితినని చెప్పిరి. నాటినుండియు నామన మామె క్షేమమరయుటకే యత్నించుచుండెను. ఆమె తమ పాదరాజీవముల పైగల ప్రేమచే నిహలోక సౌఖ్యము లిక గలుగవని తలంచి యోగినియై దుర్గమారణ్యముల తమనామమే దైవనామముగ స్మరించుచుండెను. ఆమెను పరిత్యజించుట తమకు దగునా? నమాన నేరమొనరించిన నన్నుఁ జేకొని యామెను పరిత్యజింపదగునా? యామె వరదరాజమ్మ యను నామమున వర్తించుచున్నది. తోడ్కొని వచ్చుటకు యత్నింపు" డని వేఁడుకొనియెను. ఆపలుకు లాలించి యాతఁడు నివ్వెరగంది పూర్వము తాఁజూచిన చిత్రపటము శ్లోకములు ఆమె రూపము దలచి చింతాక్రాంతుఁడై యట్టులనే తోడ్కొనివచ్చెద నని యామె కభయమిచ్చి రహస్యాలోచనమందిరమున కేగి తిమ్మరుసును రమ్మని వార్త బంపెను.

తిమ్మరు సరుదెంచినంతనే యాతనికి స్వవృత్తాంతమును జెప్పి కర్తవ్య మేమని ప్రశ్నించెను. అంత తిమ్మరుసు 'దేవా! ఆమెకు తమయందు నిక్కమగు వలపు గలదు గాని యామెచెలికత్తెలు వలదని నిర్బంధించుచున్నను యామెపల్కు లాదరింపక వార లామెపుట్టుముపై కత్తిగట్టిరి. దాన నీప్రమాదము సిద్ధించినది. యామె హృదయ మానాడే నేను గుర్తించితిని. దేవరకు విన్నవించిన తమరేమని యెదరో యను భయమున జెప్పజాలనైతిని. వలయునేని యామె నింకొకపరి

గూడ విమర్శించి గ్రహించుటయే యుత్తమము' అని చెప్పుచున్న తిమ్మరు సాపల్కులయెడ నాదరముంచి వల్లెయని సమ్మతించెను.

*   *   *   *   *   *   *

వరదరాజమ్మగారి ప్రాసాదసమీపమున గల యరణ్యప్రాంతమున నున్న యొక లతానికుంజమున నిర్వురు పూరుషులు జేరి యొక లేఖ నిట్లు చదువసాగిరి.

"వందనీయులగు తల్లిగారి పాదపద్మములకు—చిరకాలము క్రిందటనే తమరు, ఎవ్వరు మరణించియుందురని భావించియుండిరో యాతుఖారమణి- యా రుచీదేవి శతసహస్రనమస్కారపూర్వకముగా వ్రాసికొను విన్నపములు.

తమరు ప్రేమపూర్వకముగా వ్రాసి యంపిన లేఖ చేరినది. అందలి యంశముల జాగరూకతతో చదివితిని. అందలి కొన్నివిషయములు నాహృదయమున ములుకులవలె- శూలములవలె నాటినవి. ఇట్లు వ్రాయుట తమ కనంతమగు చింత నొనగూర్చునని యెఱింగియు విధిలేక వ్రాసితిని. నాయవస్థకు మిగుల పరితాప మందుచున్నామని వ్రాసియున్నారు. నా మూలమున నెవ్వరును పరితపింపవలదు. అట్లు పరితపించుచున్నట్లు నా కికముందు దెలియపరుపవలదు.

నా చెలికత్తెల ప్రబోధముల నాలించి మనసునం దుద్దేశము లేకున్నను శయనాగారమును ఖడ్గముతో ప్రవేశించి యిట్టియవస్థ నేను స్వయముగా దెచ్చికొంటిని. నాస్వయంకృతాపరాధమునకు తగిన శిక్షనే యనుభవించుచున్నాను. కాన మరియొక్కపరి బోధించుచుంటిని. నాకొరకై పరితపింపవలదు.

రాయలు కులహీనుడంటివి తమయుత్తరములో నీవాక్యమున కన్న నన్నెక్కుడుగా బాధించిన వాక్య మింకొకటి లేదనినొక్కి వక్కాణించుచున్నాను. అయ్యది విశ్వాసార్హమైన పల్కు- గానేరదు. మనతో

మన బాంధవులతో సంబంధబాంధవ్యము నెఱపిన సాగివారి ద్రోహి తుడు కులహీను డెట్లగును. ఆత డెంతమాత్రమును కులహీనుఁడు గాడు; కాజాలడు.

తమరు రాయలు నన్ను బాధించినట్లు వ్రాసియున్నారు. ఆ మహామహుడు నన్ను బాధించెనా! అమ్మా! యింత వెర్రిపడియెద వేల. పతియే దైవమను పల్కుల నాదరింపక- యగ్నిసాక్షిగ పరిణయ మాడిన మనోహరుఁడని దలంపక- సంసారసాగరమున సుఖసౌఖ్యముల దేలి యాడింపగల దివ్యపూరుషుఁడు నాథుఁడే యనుమాట మరచి- యాతని జంపుటకు ప్రథమసందర్శన దినంబున సిద్ధమైన నన్ను- పతిఘాతకు సిద్ధమైన నన్ను—తుండె తుండెములుగా ఖండింపక విడిచిపెట్టిన యామహామహుడు నన్ను బాధించె ననుచుంటివా! కల్ల కల్ల. యామహానుభావుఁడు నా కత్యంతోపకార మొనర్చియున్నాడు.

నిన్ను పరిత్యజించిన వాని దేశమున నీవేల యుండవలెనని వ్రాసియుండిరి. నన్నాతఁడు పరిత్యజించెనా? లేదు లేదు. నాదుష్టచర్య జూచి యేవగించుకొనెను గాని నాయం దిప్పటికి నిండారు ప్రేమతో నున్నాడు. వేయేల? యాతఁడు నన్ను పరిత్యజించినను నే నాతని పరిత్యజింపలేదు. పరిత్యజింపజాలను. ఆతఁడు నన్ను తన హృదయాంతరాళమునుండి పారద్రోలజాలఁడు. నన్ను మరచినను నాయకృత్యమును మాత్రము మరువజాలఁడు. నాహృదయంబున నాతని దివ్యరూప మిమిడియుండెను. దానిని దీసివేయు శక్తి నాకడలేదు. కాన న న్నాతఁడు తనవద్ద నుంచుకొనకున్న తన పాదపద్మము సేవించుకొను యధికార మొసంగి గౌరవించియున్నాడు. అట్టి యుదారస్వభావుని దేశమును పరిత్యజించుటయేనా? కల్ల కల్ల. ఈజన్మమధ్యమున నింక నట్టిది జరుగదు జరుగబోదు.

ఆతని రాజ్యమున నుండవలెనని యున్న యాతని వధించుటకు జతనములొనర్పుమనియా బోధించుచుండిరి. చాలు చాలు. ఇదివఱలో తమ ప్రబోధములచేతనే యిట్టియవస్థ సంభవించినది. ఇది చాలక మరల యత్నించుటయా! అట్లొనర్చిన నాపాపమున కింక మేరయుండునా? ఇంక నన్నాతఁడు క్షమించునా? జననీ! వేయిమాటలికేల? ఆదివ్యపూరుషుని జూచినంతనే యెట్టిశత్రునకైనను గర్వనిర్భేదమగును. అట్టి పూరుషుని యుదారస్వరూపుని యొక్కమారు తమ ప్రబోధముల కియ్యకొని చంప నుద్యుక్తురాల నైతినని లోకమున వ్యాపించియున్న యపకీర్తియే చాలును.

నావలన తమవంశమునకు కళంక మాపాదింపకుమని బోధించుచుండిరి. సరిసరి. మరల యాతని వధించుటకు యత్నించిన బాపరాని కళంకము మనవంశమును జుట్టిముట్టి వంశవృక్షమును సమూలముగా గాల్పజాలదా!

నన్నొక్కపరి తమయొద్దకు రమ్మనిరి. కాని యది జరుగుటసంభవము. ఏమహాత్ముఁడు తనకృపారసము నాపై జిల్కి నాప్రాణముల దీయక విడిచిపెట్టెనో యాతని దేశమును విడిచి యొక్క క్షణమైనను నిలువజాలను. ఇట్లు వ్రాసితినని నన్ను జూడ తమరే వచ్చెదరేమో! వలదు. వలదు. ఈజన్మమధ్యమున నాదర్శన మితరులకు గాకుండ జేసికొనదలఁచితిని. యత్నింపవలదు.

జననీ! తమకింత కెక్కుడుగ వ్రాయజాలను. క్షమింపుడు. మీపదసరోజములంటి వేడుకొనుచుంటిని. ఇంక నిటు లెన్నడును యిట్టి యుత్తరముల వ్రాయవలదు. వ్రాసినను నానుండి ప్రత్యుత్తరమును బడయజాలరు.

ఇట్లు,

రుచీదేవి."

ఆయిరువురులో నొక్కఁడు విషాదంబును జెందియుండెను. ఇరువురు లతానికుంజమునుండి వెలికరుదెంచి విజయనగరాభిముఖులై యరిగిరి.

## సమాగమము.

వరదరాజమ్మ గృహమునకు తిమ్మరుసు కృష్ణదేవరాయల సమేతముగా నేగి తా వచ్చినవార్త లోనికి బంపెను. వెంటనే యొక పరిచారిక యరుదెంచి యిరువురను లోనికి దోడ్కొని పోయెను. తిమ్మరుసు కృష్ణరాయుని చావడిలో నిలిపి లోనికేగెను. కృష్ణరాయుఁడొకయాసనముపై గూరుచుండి యొక్క గవాక్షమునుండి లోన జరుగుచున్న దంతయును గనిపెట్టుచుండెను.

రుచిదేవి తిమ్మరుసు పాదముల వ్రాలి, కన్నీటితో నాతని పదకంజాతముల నభిషేకించుచు నిట్లనియెను. "జనకా! జనకా! నాయపకీర్తి బాయు మార్గమేమియును లేదా! వలదు వలదనుచున్నను చెలికత్తెలు నాకీకత్తి గట్టియుండిరి. జనకా! ఇందు నాహృదయమును నీవైనను గుర్తింపలేకపోయితివా! జనకా! రెం డుద్దేశములతో జీవించియుంటిని- నాప్రాణాధినాథుఁడైన రాయల సందర్శనము- పితృసమానుడవగు నీయొద్ద నా నిర్మలత్వమును జెప్పికొనుట- ఇందులకు మాత్రమే జీవించియుంటిని నాకోర్కెలలో నొక్కటీవరకె సంప్రాప్తమైనది. మిగిలినది గూడ నేడు నాభాగ్యవశమున సిద్ధించినది. ఇంక నిశ్చింతతో నసువుల త్యజింపగలను" అని సందర్భము తెలియంగ జాలక మాటల పొందిక లేక విచారించుచు కన్నీటిని దుడిచికొనుచు గద్గదికయై చెప్పి దుఃఖాధికతచే మాటలాడ లేకుండెను.

తిమ్మరుసు అంత కుమారీమణీ! "గతం నశోచామి" జరిగినదానికై చింతింపకుము. రాయ లిప్పుడు తాను నీయెడ నొనర్చిన యకృ

త్యమునకు నెంతయో వగచి కృశించియున్నాడు. నిశ్చయముగా నాత నికి నీపై సంపూర్ణమైన ప్రేమగలదు. విజయనగరమునకు దోడ్కొని రమ్మని చెప్పి పంపియున్నాడు. తల్లీ! నాపల్కు లాలించి మగిడి పురంబునకు రమ్ము.

జనకా! మగిడి నన్ను సంసార వారాసిలో నేల ముంపజూచెదవు. నే నొనర్చిన యకృత్యమునకు సరియగు శిక్ష ననుభవింపనీయవా! జనకా! యొక్కపరి వేడుకొనుచున్నాను. నా కా మహాపురుషుని సందర్శన మింకొకపరి లభింపజేయుము. కలకాలము కృతజ్ఞురాలనై యుందును. నా సిర్దోషిత్వ మాతనికడ గూడ నొప్పుకొని—తిమ్మరుసు మాటముగింపకుండ నందుకొని "అమ్మా! నీవెద్ది కోరినను దీర్చుటకు సంసిద్ధుడనై యుంటినని పల్కి కృష్ణరాయా! యని పిలిచెను. కృష్ణరాయుఁ డాగృహామధ్యమున కరుదెంచి నిలచెను. తిమ్మరుసు తిరోహితుఁడయ్యెను.

రుచీదేవి రాయల పాదములకు నమస్కరించి యచ్చటనే మొదలు నఱుకబడిన తరువువలె గూలెను. కృష్ణరాయుఁ డామెను లేవనెత్తి తన బాహువల్లరులయందుంచి సమాస్వాసించుచుండెను.

అనంతరము కృష్ణరాయలు తిమ్మరుసును బిలచి ప్రయాణమునకు సర్వమును సిద్ధముచేయ నాజ్ఞాపించెను. రుచీదేవి తన యభిప్రాయమును వెల్లడింపనెంచి నంతనే రాయలు దేవీ! మారాడవలదు. నాయాన గలదని వారించి మహేంద్రవైభవముతో విజయనగరమునకు దోడ్కొని పోయెను.

## తిరుమలదేవీ వివాహవృత్తాంతము.

ఉత్కళదేశమునకు దండయాత్రకై యరిగిన కృష్ణదేవరాయలు ప్రతాపరుద్రగజపతితో యుద్ధమొనరించి యాతని నోడించి దేశమున

నిలువనీయక తరుముచుండెను. ప్రతాపరుద్రగజపతి యాతని ధాటి కాగలేక రాయలునకు తనకుమార్తె నొసంగెదననియు తిమ్మనిక బాధ పెట్టవలదనియు సంధిపై వార్తబంపెను. ఆసంధి షరతు లంగీకరింప బడెను.

తిరుమలదేవికిని కృష్ణరాయలునకును వివాహ మత్యంతవైభవ ముతో జరుపబడెను. ఆవివాహము జయప్రదముగా జరిగె ననుటకు సంశయ మిసుమంతయును లేదు. కాని తిరుమలదేవికి మాత్రము రా యలను బెండ్లియాడుట కిష్ట మిసుమంతయును లేదు. ఆమెయు కృష్ణ రాయుని కులహీనుడుగా దలచి తన మనంబున నిట్లని వితర్కింప సాగెను. "కట్టా! పరమపవిత్రమైన గజపతి వంశమున బుట్టి దాసి పుత్రుని జేపట్టవలసివచ్చెనుగదా! ఇట్టి నికృష్టజన్ముల వరించి వారల తో నుండుటకంటె బాణరజ్జువిషాగ్ని కీలలబడి పంచప్రాణంబుల పం చత్వంబు నొందించుట శ్రేయస్కరము. తుచ్ఛసౌఖ్యంబుల కాశించి పరువుప్రతిష్ఠల జంపుకొని మానాభిమానములు మంటగలపి- పవిత్ర మైన క్షాత్రవంశమున నుద్భవించిన- నేను యొక్క కులహీనునితో నా కాపురము సేయుట" అని వితర్కించుకొని తనమనంబున రాయలఁ జంపి తానుగూడ జచ్చుటకు నిశ్చయించుకొనెను.

రహస్యగోపనమునందు స్త్రీలు సమర్థులు గారనుట నీమెపట్ల సార్థకమైనది. ఆమె తన యభిప్రాయమును యొక్క చెలికత్తెతో జెప్పెను. పెదవిదాటిన పృథ్విదాటు ననునట్లు తుద కానోటనుండి యానోటబడి తుట్టతుదకు తిమ్మరుసునకు దెలియవచ్చెను.

ఆతఁడు తిరుమలదేవికిని రుచీదేవి కుద్భవించిన ట్లీనురాలోచన యుద్భవించినందులకు కడుంగడు చింతించి దానికి తగు ప్రతీకార మొ నర్పవలయునని యూహించి కృష్ణరాయుని విగ్రహమొక్క టతిశీఘ్ర కాలంబున జేయించి యందు తేనెవోసి జాగ్రత్తపెట్టెను.

కతిపయదినంబులకుఁ బిమ్మట రాయలునకు శ్రీపుష్ప యోగమునకు ముహూర్త మెంపబడియెను సర్వమును సిద్ధము జేయబడెను. తిమ్మరుసు రాయల విగ్రహమును శయ్యాగృహము జేర్చి రహస్యముగా నొక్క హంసతూలికాతల్పమున పరుండబెట్టి యొకదుప్పటము గప్పెను. ఈపనులన్నియును కడుంగడు రహస్యముగా జరిగింపబడెను దాసీ జనంబులతోఁ గృష్ణరాయలు మిగుల నలసియుండుటచే శయనించి యున్నాడనియు, కొన్ని ఘడియలవఱకు నాతని మేల్కొలుపవలదనియు జెప్పి వెలికరుదెంచి రహస్యమార్గమున శయ్యాగృహములోని కేగి యందొకచో దాగియుండెను.

పిమ్మట కొన్ని నిమేషములకు దాసీజనంబులు తిరుమలదేవిని శయనాగారమున డించి వెడలిపోయిరి తిరుమలదేవియు ద్వారమును మూసి తన మొలలో గుప్తముగా నిముడ్చియున్న కైజారును వెలికి దీసి రాయల విగ్రహము వక్షముపై బలముగా గ్రుమ్మెను. ఆపె ఖడ్గమును పైకి దీయునప్పుడు లోనున్న తేనె పైకెగజిమ్మ యాయింతి మోమును పైనను నోటియందును బడియెను ఆ తేనెబిందువుల రుచిజూచి తిరుమల దేవి "యీతనిరక్తమే యింతరుచిగానున్నది. ఈతఁడెట్టిసుగుణపుంజమో గదా! అన్యాయముగా జంపితినే" యని వాపోవుచుండఁగా తిమ్మరుసు వెలికరుదెంచి "తల్లీ గతించినదానికి చింతింపకుము. నీ కామహీనరాజు కావలసియున్న యెడల జూపగలను కాని నీవు నీ దురుద్యోగమునకు స్వస్తిజెప్పి యాతని కెట్టియపాయమును గల్గింపనని శపథముచేయుము. చెప్పుడువారి మాటలాలించి సత్యాసత్యము లరయక స్వామి ద్రోహితుఁడని యెఱుంగక కులహీనునిగా భావింపదగునా? తల్లీ యెంత వెఱ్ఱిదానవు. సకలశాస్త్ర పరిచయుడనైన నేను- సద్బ్రాహ్మణవంశసంజాతుఁడనగు నేను నొక్క దాసీపుత్త్రునకు విధేయుడనై యాతని పాదము లాశ్రయించి గొల్వుసేయుదునని యే భావించితివా! తల్లీ నీయంతఃకరణసాక్షి

గా నాలోచింపుము. తల్లీ నామాటనమ్ముము. నీకురుద్యోగము మాను కొను" అని పెక్కువిధముల బోధించి యామెచే పెక్కుబాసలు గైకొని రాయలను బిలచి వధూవరుల యందొకరిమెడ నొకరికి భేదబుద్ధి లేకుండునట్లొనరించి విజయనగరమునకు దీసికొనివచ్చెను.

## కృష్ణదేవరాయల వివాహములగూర్చి విదేశీయుల యభిప్రాయములు.

అచ్యుతదేవరాయల కాలములో హిందూదేశమున సంచారము జేయుచు కర్ణాటసామ్రాజ్యమునకు ముఖ్యపట్టణమగు విజయనగరమున కరుదెంచి న్యూనిస్ (Newnis) అను పోర్చుగీసు దేశీయుడు పారశీక భాషలో వ్రాసియుంచిన కృష్ణదేవరాయచరిత్ర నవీనముగా నాంగ్లేయ ములోనికి తర్జుమా చేయబడియుండెను. అందు చిన్నాదేవి వేశ్యాంగ నాపుత్రియనియు రాయలున కామెతో సంపర్కముగలిగియుండెననియు రాయలు స్వజాతి కన్యను వివాహమాడినపిదప చిన్నాదేవినిగూడ దేవిగా గైకొనెననియు వ్రాసియుండెను.

మనుచరిత్ర పారిజాతాపహరణములందు చిన్నాదేవిని దేవేరిగా వర్ణించియున్నారుగాని యామెకులగోత్రముల నిరూపించి యుండలేదు. (అవసరము లేకుండుటచే నిరూపింపబడ లేదు.)

న్యూనీజ్ వ్రాతలవల్ల కృష్ణరాయలునకు చిన్నాదేవిపై నధిక మగు ననురాగమనియు- ఆమె నివసించుటకు నాగలాపురమను నొక పేట గట్టించియుండెననియు- ఆపట్టణమునుండి వేలకొలది రూప్యములు సుంకముగా వసూలుచేయబడుచుండెననియు తెలియవచ్చుచున్నది.

కృష్ణదేవరాయ విరచితమైన యాముక్తమాల్యదయందు, మను చరిత్రమునందును పారిజాతాపహరణమందును బేర్కొనబడిన చిన్నా

దేవిమాట జెప్పక అన్నపూర్ణాదేవియని వ్రాయబడియుండెను. ఇందుల కేమికారణమైయుండునో నిశ్చయింపజాలము. కొందఱ అన్నపూర్ణదేవియు వరదరాజమ్మయు నొక్కరేయని చెప్పుచున్నారు. అయ్యదిగూడ విశ్వాసార్హమైనట్లుగా దోచుచున్నది. అందువలన కృష్ణదేవరాయలునకు ముగ్వురు భార్యలని చెప్పుచుండిరి. ఇందలి సత్యాసత్యముల నిరూపించుటకుఁ దగిన యితరయాధారములు లభింపనందున నిశ్చయించుటకు వీలు లేకున్నది.



## శ్రీకృష్ణదేవరాయల పూర్వదిగ్విజయయాత్ర.

రాయలకోర్కె నీడేర్చుటకు రెండుసంవత్సరములు గడువు తీసికొని తిమ్మరుసు రాష్ట్రమునందును, సైన్యమునందును గలలోపముల సంస్కరించుటకు పూనుకొనెను. అరబ్బిదేశమునుండియు, పారశీకమునుండియు మేలుజాతిగుఱ్ఱములను దెప్పించి యశ్వసైన్యమును తయారుచేసి వారిలో మిక్కిలి నేర్పుగలవారికి బహుమానములనొసంగుచు గౌరవించుచుండెను. అందువలన శూరులెల్లరును యశ్వములపైనుండి యుద్ధము జేయుటయందు మిగుల ప్రావీణ్యమును సంపాదించి యుండున ట్లొనరించెను.

గజముల పెక్కింటిని గూర్చి యశ్వసైన్యమునకుఁ దోడు గజసైన్యమును గూడ వృద్ధి యొనర్చెను. రాజకీయోద్యోగులలో రాజద్రోహులుగా ననుమానింపబడిన వారలను దొలగించి వారియాస్థానముల సమర్థులగు చిన్నియుద్యోగస్థుల నియమించి వారలు యథాకాలమున కార్యముల జక్కబెట్టుచుండిరో లేదో స్వయముగా విచారించుచు యుద్యోగములనుండి దొలగింపబడినవారు తిరుగుబా టొనరింపకుండ నొకకంట గని పెట్టుచుండెను. క్రొత్తగా క్రొత్తయుద్యోగములలో నియ

మింపబడినవారలు కడుశ్రద్ధాళులై దిగ్విజయానంతరము తమకు లభించుబహుమానముల గొనన్ నేర్పుతో మెలగుచుండిరి. సమయము మరుదెంచినంతనే రాయలపైఁ గత్తిగట్టనెంచు సామంతులను బారద్రోలి వారిస్థానములు విశ్వాసనీయులగువారల కొసంగి తనయెడ నధికభయము గలవారలగా నొనరించుకొనెను. రాయలు దిగ్విజయయాత్రలో నున్నప్పుడు రాజ్యమునందు నంతఃకలహములు సంభవింపకుండునట్లు కట్టుబాట్ల నొనరించెను. జైత్రయాత్రకు గావలసిన యాహారపదార్థములు, మందుగుండుసామగ్రిలు విల్లమ్ములు మున్నగువానిని మిక్కుటముగా సంపాదించి యుంచెను. శిబిరములను నిర్మించుటకు గావలసిన పరికరములు మున్నగువానిని సంపాదించియుంచెను తలచినంతనే దిగ్విజయయాత్రకు బయలుదేరుట కనువుగానుండున ట్లన్నియు సిద్ధము చేసి యుంచెను.

పరరాజులయొక్క కోటలను బట్టుకొనుటకు సులభమగు ప్రదేశములను, ఆప్రదేశములయొక్క లక్షణములను, యాప్రదేశములకు సైన్యముతో రహస్యముగా బోవుటకు వీలైన మార్గములను దెలిసికొనుటకు వీలగునట్లుగా బటముల వ్రాయించి సిద్ధముగా నుంచికొనెను. పరరాజులయొక్క బలముల సంపూర్తిగా నెఱిగి ముమ్మం దెవ్వరి జయించి ముంమునకు యాత్ర సాగించుటకు వీలుగనుండునో గుర్తిడుకొని యుండెను.

తిమ్మరుసిట్లు సర్వమును సిద్ధముచేసికొని రాయలయొద్ద కేగి దిగ్విజయమునకు బయలుదేరవచ్చు నని యెఱిఁగించెను. రాయలు తిమ్మరుసునే సేనాధ్యక్షునిగా నియమించి, తిమ్మరుసు తమ్ముఁడైన గోవిందరాజును పురపాలకునిగా నియమించి యొక్కశుభముహూర్తమున దిగ్విజయమునకు బయలుదేరెను.

## ద్వితీయభాగము.

ఇట్లు సముత్సాహ సన్నాహ వాహినీ సమేతుఁడై రాయలు పురంబు నిర్గమించి నెడనెడ దండువిడియుచు క్రమక్రమంబున పరరాజ్యముల నొక్కటొక్కటిగ నాక్రమించుచు వీరవిహారంబు సలుపుచు విజయనగర రాజ్యమును విస్తరించెను. తురకల పెక్కురజయించి వినుకొండ బాలించుచున్న గజపతిపై యుద్ధమునకేగి యాతనికి సహాయమొనరింప నరుదెంచిన పదునార్గురుపాత్రులను మోసగించి గజపతికుమార్తెను వివాహమాడినసంగతు లీవఱకే విశదీకరింపబడెను. ఈతని దిగ్విజయమును గూర్చి మనుచరిత్రమందును, పారిజాతాపహరణమందును జెప్పబడినపద్యముల నిందుదాహరించుచున్నాడను.

సీ. తొలుదొల్త నుదయాద్రి । శిల దాఁకి తీండ్రించి
నసిలోహమున వెచ్చ । నఘఁజనించె
మఱికొండవీడెక్కి । మార్కొని నలినైన
యలకసవాపాత్రు । నంటిరాఁజె
నటసాగి జమ్మిలో । యబడి వేగివహించె
గోనబిట్టేర్చి గొ । ట్టానఁదగిలె
కనకగిరిస్ఫూర్తిఁ । గరఁచె గౌతమిఁగ్రాఁచెఁ
నవులనాపొట్నూర । రవులుకొనియె
మాడెములవేల్చె నొడ్డాది । మసియొనర్చె
గటకపురిఁ గాల్చె గజరాజు । గలఁగిపఱవఁ
దోఁకచిచ్చన నౌర యు । ద్ధురత గృష్ణ
రాయబాహుప్రతాప జా । గ్రన్మహాగ్ని.

మను. ఆ. 1. ప. ౩౭

ఉదయగిరి దుర్గమును బాలించుచున్న వీరభద్రగజపతిని భీమాహవంబున నిర్జించి వింధ్యాటవులకు బారద్రోలినట్లు క్రిందిపద్యమువల్ల దెలియవచ్చుచున్నది.

మ. ధర కొండభూపులు కృష్ణరాయలంచనూ । ధాటీగతి న్వింధ్యగ
హ్వారముల్ దూఱగజూచి తారచటగా । పైనుండుటం జాలన
చ్చెరువై యెఱ్ఱని వింతచీకటులు వ । చ్చెంజూడరే యంచు వే
సారిదింజూతురు వీరభద్రగజరా । ట్యుద్ధాంతముద్ధాంసల్.

సింహాచలప్రాంతమును జయించి సింహాచలస్వామిని సేవించి స్వామికి దానధర్మముల బెక్కింటిని యొనర్చి యచ్చటి సమీపమున నొక్కజయస్తంభము నిర్మించినట్లు చెప్పుచు యల్లసాని పెద్దనామాత్యుఁడు దేవతాంగనలు స్వామిని సేవించుటకు వచ్చుచు కృష్ణరాయనికీర్తిప్రతాపంబుల గొనియాడుచు కళింగమేదినీశ్వరుని నపకీర్తిఁగూర్చి ముచ్చటించుకొందురని యుత్ప్రేక్షించియున్నాడు.

చం. అభిరతికృష్ణరాయుఁడు జ । యాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగఁ బొట్టునూరికడ । నిల్పినకంబము సింహభూధర
ప్రభుతిరునాళ్లకుం దిగు సు । రప్రకరంబు కళింగమేదినీ
విభునపకీర్తి కజ్జలము । వేమరు పెట్టి పఠించు నిచ్చలున్.

సీ. ఉదయాద్రి వేగ న । త్యుద్ధతి సాధించె
వినుకొండ మాటమా । త్రన హరించె
కూటముల్ చెదరంగ । కొండవీ డగలించె
బెల్లముకొండయ । చ్చెల్ల బాపె
దేవరకొండయు । ద్వ్యాప్తిభంగము సేసె
జల్లపల్లి సమగ్ర । శక్తి డులిచె
గినుకమీఱ ననంత । గిరికిందు వడఁజేసె
గంబముమెట్టు గ్రి । క్కునఁ గదల్చె
బలని కాయము కాలిమ । ట్టలనె యడఁచు
కటకమునుసింక ననుచు ను । త్కళమహీశుఁ

డను దినంబును వెరచు నె । వ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణ । రాయవిభుఁడు.

## రాయచూరు ముట్టడి.

సాళువనరసరాయలుగాని, తన తండ్రిగాని, తనయన్నగారుగాని సాధింపలేక విడచిన రాయచూరుదుర్గమును సాధింప కృష్ణదేవరాయలు కోరుచుండెనుగాని యాదుర్గపరిపాలకుఁడగు ఏడిల్ షా పెక్కువత్సరముల నుండి హితుఁడుగానుండుటచే వైరకారణము దొరకలేదు. ఇట్లుండగా సైడ్ మెర్కారను నాతఁడు గుఱ్ఱములు గొని తెచ్చెదనని రాయలవద్ద ధనము గైకొని ఏడిల్ షా నివసించి యున్న బీజపురమునకు పారిపోయెను. రాయలు ఏడిల్ షాకు సైడు నీదేశమందున్నాఁడు. వెంటనే యా[illegible] మావశము చేయవలసినది. ఆతఁడు రాజద్రోహి యగుటచే నట్లు వ్రాసితిమి. పంపించకున్నచో యుద్ధము సిద్ధమని వ్రాసి ఏడిల్ షాకు పంపెను. షరాను లందుల కంగీకరింపలేదు. అయ్యదియే క్రోధకారణమైనది.

1520 క్రీ. శ. సంవత్సరమున కృష్ణదేవరాయలు విజాపురముపై దండెత్తి తురుష్కుల నోడించి, రాయచూరు ముదిగల్లు మున్నగు దుర్గముల బట్టుకొనెను. ఏడిల్ షా పారిపోయెను.

ఈ రాయచూరుముట్టడి రెండుమార్లు జరిగినట్లుగా గొందరు చెప్పుచున్నారు. 1512 లో రాయలు దండెత్తి ఏడిల్ షాను తరిమివైచెననియు, ఏడిల్ షా బలమును తిరుగ గూర్చుకొనెనని యాలించి తిరుగ 1520 లో మరల దండెత్తెననియుఁ జెప్పుదురు. 1520 జరిగిన యుద్ధానంతరమున జరిగిన సంధినియమముల పాటించి బిజాపూరు విజయనగర రాజ్యములు గొంతకాలమువఱకు మైత్రిగలిగి యుండెను.

# తిమ్మరుసుమంత్రి చరిత్రము.

తుళువవంశీయులకు రాజ్యప్రాప్తి గలుగుటకును విజయనగర రాజ్యము విస్తరించి మహోన్నత స్థితికి వచ్చుటకును కారణభూతుఁడైన తిమ్మరుసు చారిత్రముగూడ నిందు కెఱుఁగ వలసియున్నది.

ఈతఁడు నాదెండ్లవారి దౌహిత్రుఁడు. సాళ్వవారి పౌత్రుఁడు. రాచిరాజునకుఁ బుత్రుఁడు. ఈతని కొకసోదరుఁడును. (గోవిందరాజు) సోదరియునుఁ గలరు. బాల్యమునందే తల్లిదండ్రులు గతించుటచే మాధుకరవృత్తిని జీవయాత్రఁ జేయుచు విద్యాభ్యాస మొనర్చుచుండిరి.

ఒకనాఁడు తిమ్మరుసు చెట్టుక్రింద నిద్రించుచుండగా నొకకృష్ణసర్ప మాతనికి సూర్యరశ్మి తగులకుండఁ దనపడగ విప్పి ఛత్రముగా బట్టియుంచెను. ఒక సిద్ధుఁ డదిచూచి యాతఁ డత్యంతయశస్సు నంపాదింపగలఁడని తలఁచి యాతని లేపి జరిగినకథయెల్ల జెప్పి గృహమునకు బొమ్మని చెప్పి యాతనిని వీడ్కొనియెను.

నాదెళ్ళచిట్టిగంగనామాత్యుఁడు జనులచేఁ బైకథ నాలించి యందలి సత్యమరయ తిమ్మరుసును యాతనితమ్ముఁడగు గోవిందరాజును బిలిపించి వారలను బరీక్షించెను. వారల యసమానప్రతిభకు సంతసించి వారలకు రాజనీతి, దండనీతి, అర్థశాస్త్రము మున్నగు రాజకీయములు నేర్పి తనయవసానకాలమున తుళువనరసరాయలకుఁ దిమ్మరుసుయొక్క యసమానప్రతిభనుగూర్చి యెఱుఁగజెప్పి యాతనికడ తిమ్మరుసును మంత్రిగా నియమించెను.

తుళువనరసరాయలు స్వతంత్రించినపిదప తిమ్మరుసే మహామంత్రిపదవి నాక్రమించెను. అనంతరచారిత్రము స్థాలీపులాకన్యాయముగా నీవలికే వ్రాయబడియుండెను. ఈతనినిగూర్చి కుమారధూర్జటియు మాదయగారి మల్లనయు నిట్లు పాడియున్నారు.

చ. కరచరణంబు లందఱకుఁ । గల్గినయంతటనే సమర్థతన్
మెరువడిగాంచనేర్తురో మ । నీషివరుల్ ధరలోననెవ్వరి
క్కరణిఘటింపుచుం గృతయు । గంబునఁ ద్రేతను ద్వాపరంబునం
దరయఁగ సాళ్వతిమ్మసచి । వాగ్రణికి న్సరిమంత్రి గల్గునే!

కుమారధూర్జటి.

సీ. ఏమంత్రిమణి నిజ । స్వామికార్యక్రియా
తత్పరమానసో । త్సాహశాలి
ఏమంత్రిమణి మిత్ర । హితబాంధవాశ్రిత
పరిరక్షణకళా । ప్రౌఢబుద్ధి
ఏమంత్రిమణి వచో । హేలాతినైర్మల్య
శీతలతాభూత । శీతరోచి
ఏమంత్రిమణి సుధా । ధామశాంభవధామ
ధాళధళ్యసుతుల్య । ధవళకీర్తి
అట్టిమంత్రి కులోత్తంస । మహితనృపతి
పటలమకుటాగ్రఘటితస । త్పద్మయుగళి
సకలకర్ణాటరమాధవ । చక్షుఁడు
దీనసురశాఖ సాళువ । తిమ్మమంత్రి.

ఒకనాడు భట్టుమూర్తి యనుకవీశ్వరుఁ డీతనిపైఁ గినిసి యాక్రిం
ది యుత్పలమాలికలను రాయల నిండుసభలో జెప్పియుండెను.

ఉ. లొట్టయిదేటిమాట వెను । లోభులతో మొగమాటమేల తాఁ
గుట్టకయున్న వృశ్చికము । కుర్మరపుర్వని యందు రేగదా
పట్టపురాజు పట్టి సరి । పల్లెసరానరి నీయకున్న నేఁ
దిట్టకమాన నామతము । తీవ్రమహాగ్రి భయంకరంబుగాఁ
దిట్టితినా మహాగ్రహమ । తిక్క మకరగ్రహజర్జరీభటా

పట్టపు దట్టపాలఘణి । భర్తృబహూకృతశర్జటస్ఫుటా
ఘట్టన దట్టణాలకవి । ఘట్టనిరర్గళ రాజభృత్యకీ
చట్టచటార్భటీ నయన । జర్జరకీలలు రాలగావలెఁ
జుట్టరికంబునం బొగడ । జూచితినా రసతాద్యప్రథిత్యకా
పట్టణమధ్యరంగగత । భవ్యవధూవదనానుషంగనం
ఘట్టశిరస్థ్సగాంగఝుర । హల్లకజాలసుధాతరంగముల్
చుట్టుకొనంగఁ వలెఁ భువన । చోద్యముగాఁ బయిదంబుగామఱిన్
దిట్టితినా సభాభవన । ధీంకృతభీమనృసింహరాడ్ధ్వజా
తాట్టమహాట్టహాస చతు । రాస్యసముద్భ్రుకుటీతటీనటీ
కొట్టణరోమజాలహృత । కుంఠితకంఠగభీరనాదనం
ఘట్టవిజృంభమాణగతి । గావలె దీవెనపద్యమిచ్చి చే
పట్టితినా మణీకనక । భాజనభూషణభాసురాంబరా
రట్టతురంగగంధగజ । రాజదమూల్యఘనాతపత్రభూ
షట్టణభర్మహర్మ్యభట । పంక్తిచిరాయురవాప్యయంబునై
గట్టిగతోడుతో వెలయఁ । గావలె నెక్కువకీర్తిఁ జూడుడీ
యట్టిటునుండెమేలముల । నందఱనుఁబలె జుల్కజూచి యే
కట్టుననైనఁ గేరడము । పల్కకుడీ పయిపెచ్చు నందులన్
గొట్టుదు దుష్కవిద్విరద । కోటులఁ బాచనుఖోద్భటాకృతిన్
బెట్టుదు దండముల్ సుకవి । బృందముకే యతిభక్తిసారెకున్
గట్టితిముల్లె లేబదియు । గాగల నూటపదారు లెయ్యడన్
రట్టడిభట్టుమూర్తికవి । రాయని మార్గ మెఱుంగ జెప్పితిన్.

అని తిట్టుపద్యము వాశువుగా రచించి యంతటితో తృప్తిఁబొందక

గీ. ముందు నిప్పుడు నికమీద । మోదమరల
పద్యదండంబు చేబూని । పార్థివులను

జంపుమన్నాడు చంపును । చంపగలఁడు
పరుషవాక్యతనమవర్తి । భట్టుమూర్తి.

అని చెప్పి పట్టజాలని కోపంబున తిమ్మరుసు సంగ్రహచరిత్రని ట్లీనడింపుగా వర్ణించి శపింపనెంచెను.

శా. గుత్తిం బుల్లెలు గుట్టి చంద్రగిరిలోఁ । గూడెత్తి పెన్గొండలో
హత్తిన్ నత్రమునందు వేడి బలుసు । ర్గానీనుతాంబూలపుం
దిత్తుల్ మోసి పదస్థులైన ఘనులన్ । దీవింప ... ...

అని మహాగ్రుద్ధై చెప్పునప్పటికి తిమ్మరుసు తన యపకీర్తి భూమిలో నాచంద్రతారకముగా నిలచిపోవునేమో యను భయంబు పెంపున రాయలు తనకు పట్టాభిషేకసమయమున పారితోషికముగా నొసంగిన పచ్చలతారహారమునుఁ దీసి భట్టుమూర్తికి సమర్పించెను. అంత భట్టుమూర్తి సంతసముతోఁ దనకోపం బుడిపికొని యిట్లా పద్యంబును మార్చి పూరించెను.

* * * దీవించెదన్
మత్తారాతి యయాతి నాగమసుతున్ । మంత్రీశ్వరున్ దిమ్మనిన్.

అనిచెప్పి తన యానందమును యాతిమ్మరుసుకీర్తిని వెల్లడింప నెంచి వెండియు యీక్రిందిపద్యమును జెప్పెను.

క. అయ్యా యనిపించుకొంటివి
నెయ్యంబునఁ గృష్ణరాయ । నృపపుంగవుచే
నయ్యా! నీసరి యేరీ?
తియ్యనివిలుకాడవయ్య । తిమ్మరుసయ్యా!





శ్రీరస్తు.

# శ్రీకృష్ణదేవరాయచరిత్రము.

## ద్వితీయభాగము.

### విద్యాగోష్ఠి.

కృష్ణదేవరాయలు నిజపరాక్రమమున పెక్కు రాష్ట్రములఁ జయించి విజయనగరరాజ్యమును విస్తరింపజేయుటయే కాక సరసవచోనైపుణ్యముగల పెక్కురు కవీశ్వరుల నాదరించి వారలచేఁ బెక్కులగు నమూల్యకృతులం గృతినందుకొని యంతమాత్రమున సంతుష్టి నందబోక స్వయముగా సంస్కృతాంధ్రముల నసమానపాండిత్యము సంపాదించి రసవంతముగఁ గవిత్వముఁ జెప్పగలవాఁడై, యాంధ్రమున విష్ణుచిత్తీయమని నామాంతరమున్న యాముక్తమాల్యదయను గ్రంథరాజమును సంస్కృతంబున మదాలసచరిత్రము మున్నగు గ్రంథముల రచించి కృతార్థతఁ జెంది యాంధ్రభాషకు వన్నెదెచ్చిన పూరుషాగ్రగణ్యుఁడని పేరు వడసెను.

ఈతని యాస్థానమున నద్వితీయుఁడని వన్నెకెక్కిన యాంధ్రకవితాపితామహ బిరుదాంకితుఁడగు నల్లసాని పెద్దనామాత్యుఁడు, ముక్కుతిమ్మనార్యుని ముద్దుపల్కులని వన్నెకెక్కిన నంది తిమ్మనామాత్యుఁ

డును, పల్కులమాధుర్యమును చవిగొన్న కృష్ణదేవరాయలచే "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేల గల్గెనో యతులితమాధురీ మహిమ" యనియనిపించుకొని విఖ్యాతి కెక్కినధూర్జటికవిశేఖరుఁడును సరస సాహిత్య మృదుమధురోక్తి కీడు రాని మాదయగారి మల్లనయు, శ్లేషకావ్యఘటనాతత్పరతన్ రాఘవపాండవీయమును నూతన కథావిధానకల్పితవిశారదత్వమును సూచించు కళాపూర్ణోదయమును రచించి సాటిలేని కీర్తిగొన్న పింగళి సూరనార్యుఁడును, మిగుల బ్రఖ్యాతిగన్న రామభద్ర కవిపుంగవుడును, దేశదేశముల హాస్యరసమునఁ దేలించుచు నిప్పటికి మృతజీవునివలెనున్న తెనాలి రామకృష్ణ కవిశేఖరుఁడును, వసుచరిత్ర నిర్మాణమునం దసమాన ప్రతిభచూపించిన రామరాజభూషణుఁడును నను యెనమండ్రకవీశ్వరులు "అష్టదిగ్గజము" లన ప్రసిద్ధిగాంచి యుండిరి.

రాయలు తీరికయైనప్పుడెల్ల కవిబృందముతో నుల్లాసకరంబుగా మాట్లాడుచు వారల కవితా చమత్కారమునకు సంతసించుచు వారలకుఁ జిత్రవిచిత్ర సమస్యల నొసంగుచుఁ గాలయాపన మొనరించుచుండును.

ఒకానొకప్పుడు రాయలు పసిడిపళ్ళెరమున నొక్క గండపెండేరముంచికొని సభారంగమునకుఁ దీసికొనివచ్చి కవిశేఖరులఁగాంచి వారలతో నిట్లనియెను. "ఆశువుగా సంస్కృతాంధ్రముల సమముగాఁ గవిత్వము చెప్పగలవార లిద్ది గైకొనుడు."

వెండియు తన యభిమతంబునుబద్యరూపమున నిట్లుచెప్పెను.

ఉ. ముద్దుగ గండపెండియర । మున్ గొనుడంచు బహూకరింపగా
నొద్దిక నాకొసంగుమని । యొక్కరుఁ గోరఁగలేరు లేరొకో

అని నుడువుచుండ నెల్లరును విన్ననగుమోములవాల్చి చూ

చుచుండ యాంధ్రకవితామహుఁడగు నల్లసాని పెద్దనామాత్యుఁడు లేచి రాయలపద్యభాగము నిట్లు పూరించెను.

పెద్దనబోలు పండితులు । పృథ్విని లేరని నీ వెఱుంగవే
పెద్దన కీదలంచినను । పేరిమి నాకిడు కృష్ణరాణ్ణృపా.

అని పూరించి యాశువుగా సంస్కృతమునను ఆంధ్రమునను నిట్లుత్పలమాలికావృత్తములఁ జెప్పెను.

ఉ. పూతమెఱుంగులుం బసరు । పూఁప బెడంగులుఁ జూపునట్టివా
కైతలు జగ్గు నిగ్గునెన । గావలెఁ గమ్మన గమ్మనన్వలెన్
రాతిరియుం బవల్ మరపు । రాని హొరాయల్ చెలియారజంపుని
ద్దాతరితీపులో యనగ । దారసిలన్వలెలోదలంచినన్
బ్రాతిగఁ బైకొనన్ వలెను । బైదలికుత్తుకలోని పల్లటీ
కూతలనన్వలెన్ సొగసు । కోర్కులు రావలె నాలకించినన్
జేతికొలంది గాగిటను । జేర్చిన కన్నియ చిన్ని పొన్ని మే
ల్మూతల చన్నుదోయివలె । ముచ్చట గావలెఁ బట్టిజూచినన్
డాతొడనున్న చిన్నెల మిటారపు ముద్దులగుమ్మ కమ్మనా
వాతెఱ దొండపండువలె । వాచవి గావలె బంట నూదినన్
గాతల తిమ్మిచూలి దొర । కైవసపుంజవరాలి సిబ్బెపు
న్మేతెలి యబ్బురంపు జిగి । నిబ్బర పుబ్బగు గబ్బిగుబ్బ పొం
బూతల నున్నకాయ సరి । పోడిమి కిన్నెర మేలుబంతి సం
గాతపు సన్నతంతి బయ । కారపుఁ గన్నడ గౌళపంతుకా
సాతతతానతానలప । నన్ దివుటాడెడు గోటమీటుబల్
మోతలునుం బలెన్ హరువు । మొల్లముగావలె నచ్చతెన్గులీ
రీతిగ సంస్కృతంబు పచ । రించెడు పట్టున భారతీ వధూ
టీతపనీయ గర్భనిక । టీభవ దానవ సర్వసాహితీ

ఖ్యాతిక నాటక ప్రకర భారత భారత సమ్మతప్రభా
శీత నగాత్మజా గిరిశ శేఖర శీతమయూఖ రేఖికా
పాతసుధాప్రపూర బహుభంగ ఘుమంఘుమఘుంఘుమార్భటీ
జాతక తాళయుగ్మలయ సంగతి చుంచువిపంచికామృదం
గాతత తేహి తత్తహిత హాధిత దింధణుధాణుధింధిమి
వ్రాతనయానుకూలపద వారకుహూద్వహ హారకింకిణీ
నూతనఘల్లుఘల్లాచరణ నూపుర ఝూళఝుళీ మరంద సం
ఘాత వియద్ధునీ చకచకద్వికచోత్పల సారసంగ్రహో
యాతకుమారగంధవహ హారిసుగంధ విలాసయుక్తమై
చేతము చల్లజేయవలె జిల్లన జల్లవలెన్ మనోహర
ద్యోతక గోస్తనీఫల మధుద్రవ గోఘృతపాయసప్రసా
రాతి రసప్రసారుచి రసప్రసరంబుగ నారసారెకున్.

కృష్ణదేవరాయలాతని యాశుకవితాధారాప్రవాహంబున నోలలాడి యత్యంత సంతుష్టహృదయాంతరంగుఁడై యల్లసాని పెద్దన కవీంద్రా! నీవె యీ గండపెండేరము బహుమానమందఁదగినవాఁడ వని నుతించి తన స్వహస్తములతో నాతని కాలికిఁ దొడిఁగెను. అంత నల్లసాని పెద్దనామాత్యుఁడు నీ యాశీర్వచనపద్యమును గూడ నాశువుగా రచించి చెప్పెను

శా. క్షీరాంభోధియందు యోగపరణిన్ చిచ్ఛక్తి ప్రాపించి త
ద్గోరాజత్కరుడస్థగోపవిలస ద్గోరాజగోలోకతా
స్వారాలోకన తేజగాత్రిచలన ధ్వాంతాద్రి దంభోళికృ
త్సారజ్ఞాన సునందవాది మునిబృం దాశ్య సామర్థ్యవాః
పూరాకారతనిందుప్రజెందు కరణాం భోరాసి నిర్జం బ్రోవుతన్.

అంతటినుండియు తనవామపదంబున గండపెండేరము మెఱయుచుండ పెద్దనామాత్యుఁడు తనకింతగా గౌరవముజరిగినందులకు మురియుచు శిష్యులతో సగర్వముగా నిట్లు పల్కుచుండెను.

చం. వదలక మోఁజియు నాంధ్రకవి । వామపదంబున నున్ననూపురం
బుదితమరాళకంఠనిన । దోద్ధతి నేమని పల్కుపల్కెరా?

శిష్యులెవ్వరును దానిని బూరింపరైరి. ఒకనాడు రామకృష్ణుఁ డాదారిని బోవుచుండ పెద్దన పై రెండుపాదముల జదువుచుండెను. అంత రామకృష్ణు డందుకొని.

గుదియులకామి నున్ననితి్రి । ......పైగలభాగ్యరేఖ నీ
నుదుటను లేదు లేదనుచు । నూరువిధంబుల నొక్కిపల్కెరా.

పెద్దనామాత్యుఁ డాపల్కులాలించి గర్వముడిగి యంతటినుండి యట్లు పల్కుట మానుకొనెను.

## కరిరాజవరదుఁడు.

దిగ్విజయము సేయునప్పుడు రాయలు కృష్ణానదియొద్దున విడిసి యుండెను. కృష్ణానది వెల్లువలై ప్రవహించుచున్నందున దాట వీలులేక నచ్చటనే విడిసియుండి వెల్లువలించుక తగ్గినంతనే ముసల్మానులపైఁ బడవలెనని యెంచి రాయలచ్చట వేచియుండెను. తురకలును యావలిగట్టున రాయల నెదుర్కొన వేచియుండిరి. కాని వరద దినదినమునకు వృద్ధి యగుచుండెను గాని తగ్గలేదు. అందుచే తురకలు విసువుఁజెంది గజములసహాయమున కృష్ణ దాటి రాయల నెదుర్కొన నెంచిరి.

తురకసైన్యము గజములపై నధివసించి నదిలోనికి దిగెను. నదీ మధ్యమున "వడి" విస్తారముగా నుండుటచే సైనికులు మృతిజెంది కొట్టుకొనిపోయిరి; యేనుగులుమాత్రి మిద్దరి కరుదెంచి రాయలసేనలలో జిక్కుకొనెను. అంత నొక్కకవిశేఖరుఁడు కృష్ణరాయునిపై నీక్రిందిపద్యమును జెప్పియుండెను.

కం. నరసింహకృష్ణరాయా
దురమున నీ పేరిటేరు । తురకల జంపెన్

కరిరాజవరదుఁ డంచును
కరిఘటులటు మిమ్ముఁజూచి ♦ గ్రక్కునవచ్చెన్.

## కవిత్రయవిమర్శనము.

ఒకప్పుడు కృష్ణదేవరాయలు నిండుకొలువుననుండి ప్రస్తావనము న పెద్దన, తిమ్మన, భట్టుమూర్తి వీరిగ్రంథములలో నెద్ది యుత్తమ మైనద నెను. ఎల్లరును యెట్లుపల్కిన నేమిప్రమాదమువచ్చునో యని వెరచి యూరకుండిరి. అంత రామకృష్ణుఁడు లేచి దేవా! మూఁడుగ్రంథ ములనుండియు నొకేవర్ణనగలపద్యములు జ్ఞప్తికివచ్చుచున్నవి వానిని జదివెదను వినుండు. ఆపద్యములబట్టి యుత్తమోత్తమములు నిర్ణయింప వచ్చును.

పారిజాతాపహరణము తిమ్మన:—

ఉ. ఈసునబుట్టిడెందమున ♦ హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలియేడ్చెఁ బ్రాణవిభు ♦ కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైనమోముపయి ♦ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకల ♦ కంఠవధూకల కాకలీధ్వనిన్.

మనుచరిత్రమున పెద్దన:—

ఉ. పాటునకింతులోర్తురె కృ ♦ పారహితాత్మక నీవు త్రోవ ని
చ్చోట భవన్నఖాంకురము ♦ సోకె గనుంగొనుమంచుఁజూపి య
ప్పాటలగంధి వేదనను ♦ పంబిడియేడ్చెఁ గలస్వనంబుతో
మీటినవిచ్చుగుబ్బచను ♦ మిట్టుల నశ్రులు చిందువందగన్.

భట్టుమూర్తి తవ వసుచరిత్రమున:—

శా. ఆజాబిల్లి వెలుంగువెల్లికలడా ♦ యున్ లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమునబటా ♦ గ్రంబెత్తి మెల్లెత్తియా

రాజీవానన యేడ్చెఁ గిన్నెరవధూ । రాజత్కరాంభోజకాం
భోజీమేళవిపంచికారవసుధా । పూరంబు తోరంబుగన్.

పైమూడుపద్యములును కథానాయిక యేడ్చినవిధంబును సూచింపుచున్నవి. ఇందుఁ పై నాకుదోఁచినదియు సత్యమైనదియు నగు నభిప్రాయమును వెల్లడించెదను.

అల్లసాని పెద్దన్న యటునిటు యేడ్చెను.
ముక్కుతిమ్మన ముద్దుముద్దుగా నేడ్చెను.
భట్టుమూర్తిమూతిముఁ బావురని యేడ్చెను.

అని చెప్పిన రాయ లాతనిహాస్యవచనంబుల కలరి బహూకరించెను.

---

## సమస్య.

రాయల యాస్థానమున పండితవర్యులెల్లరును సమావేశమై మాట్లాడుకొనుచుండిరి. భట్టుమూర్తి యచ్చటికరుదెంచి తాను కష్టపడి కూర్చి సమస్య నొసంగి పూరించుటెట్లని ప్రశ్నించెను.

కుంజర యూధంబు దోమ । కుత్తుకఁ జొచ్చెన్.

వెంటనే రామకృష్ణుడు పరిహాసముగా మంచి సమస్య నేఁగూర్చితివి గాని పూరించుట కడుసులభమనెను. భట్టుమూర్తి రోషముతో నేదీ పూరింపుమనియెను. వెంటనే రామకృష్ణుఁడు—

కం॥ గంజాయి త్రాగి తురకల
సంజాతులఁగూడి కల్లు । చవి గొన్నావా?
లంజలకొడకా యెక్కడ
కుంజరయూధంబు దోమ । కుత్తుకఁజొచ్చెన్.

భట్టుమూర్తి గర్వము పూర్ణముగా నశించెను. ఆతనిపై మితి

లేని కోపమువచ్చెను గాని చేయునదిలేక రాయలతో మొఱపెట్టుకొనె ను. రాయలు సభారంగమున కరుదెంచి.

కుంజరయూథంబు దోమ । కుత్తుకఁజొచ్చెన్.

అని సమస్యనొసంగి రామకృష్ణుని పూరింపుమనెను. అంత రామకృష్ణుఁడు—

కం॥ రంజనచెడి పాండవు లరి
భంజనులై విరటుఁగొల్వ । బాల్పడి రకటా
సంజయ విధి నేమందును
కుంజరయూథంబు దోమ । కుత్తుకఁజొచ్చెన్.

ఆపద్యమును విని రాయ లుగ్రుఁడై నిన్న భట్టుమూర్తి కల్లేల పూరించితివని ప్రశ్నించెను. రామకృష్ణుఁడు చేతులు జోడించి "దేవా! పెద్దవాడి మహా కవిపుంగవుల కీతఁడా సమస్యనొసంగుట. తనపరతా రతమ్యమెఱుగని వారల కట్టిపూరణమే యావశ్యకము" అని చెప్పిన రాయ లమందానంద మంది సన్మానించెను.

---

## స్వర్ణయోగ చింతామణి.

ప్రస్తావనవశమున నొక్కనాడు రాయలు కాంచనాసారహిత యైన వారకాంత యొక్క తెగలదని యెఱిఁగి పరీక్షించితిననియు జెప్పెను. ధనమే ప్రధానముగాగల వారకాంతలలో ధనాశలేని భోగము చాన యుండదని కవిమండలివారెల్ల వాదించిరి. రాయలు నిదర్శనపూర్వ కముగా జూపవలయునని యెంచు అంత రామకృష్ణుఁడు తన కారుమాసము లు గడుపీయవలయునఁయు, ఆగడువులోపలనె దానిని ధనాసచే పీడిం కబడున ట్లొనరించి తన వాదమును స్థిరపరచుకొందుననియు జెప్పి య నుమతి గొనెను.

నాగలాపురంబున విలాసవతియను వేశ్యాతిలకముండెను. ఆమె ధనమునకై వలచినట్లుగాక వలచి వలపించుకొనునట్లే నటించుచు సమయ మరుదెంచినంతనే సర్వము నొక్కమారుగానే హరింపవలయు నను యాసతో నుండెను. రాయలామెకు పెక్కుపర్యాయములు ధన మొసంగి పరీక్షింపదలచెను గాని యావిలాసవతి ధనమును స్వీకరింపక "తమప్రేమ ధనమునే కాంక్షించియున్న నాకీధనమేల" నని నిరాకరింపుచుండెను.

ఒక్కదినంబున విలాసవతి యింటి కెదుటనున్న యొకమఱ్ఱిచెట్టు క్రింద నొక్కయోగి బసదిగెను. పెక్కురుజనులాతని చుట్టును జేరి తమ భావిఫలముల దెలిసికొనగోరి నిరీక్షించియుండిరి. ఆతడును కొందఱకు జ్యోతిషముజూచి శుభఫలముల జెప్పుచు మఱికొందఱకు శని చాలదనియు, గురుడు నీచస్థానమున నున్నాడనియు, కేంద్ర త్రికోణములందు నీచగ్రహము లున్నవనియు జెప్పి యాగ్రహశాంతికై దాన ధర్మము లొనరించుకొండని బోధించుచుండెను. ఆతడా మఱ్ఱికడనే యాహార నిద్రల సరకుగొనక, పరమనిష్ఠాగరిష్ఠుడై, యెండవానలకు జంకక యచ్చటనే బ్రహ్మసనాసీనుడై తపంబొనరించుచుండెను. ఈతని ప్రభావ మచిరకాలములో నూరంతయును బ్రాకెను.

విలాసవతి తల్లి తనకుమార్తె ధనము మెండుగా గడించునో లేదో యెఱుగుటకై యోగియొద్ద కరిగి నమస్కరించెను. ఆతడును వేశ్యమాతను గూర్చుండ నియమించి జనులెల్లరును వెడలిపోయిన పిదప యామెహస్తమును బరీక్షించి తలపంకించుచు సాలోచనముగా నామెతో నిట్లనియెను. "నీయదృష్టమును గూర్చి చెప్పిన నీవు విశ్వసింతువో లేదో యను భీతి జనించుచున్నది. నిజముజెప్పినచో శుభఫలము జెప్పి ధనము నశేషముగా నాకర్షించు పాడుజోస్యుల మాటలవలె నిరసింతువేమో యని సందియ మందుచున్నాను?" వేశ్యమాత యా

తనిపల్కాలాలించి! దేవా! తమబోటి మహామహులు చెప్పినవాక్యము వేదవాక్యములుగా శిరసావహింతును. యోగీశ్వరులయెడ నాకత్యంత నమ్మకముగలదు. సందేహింపక భావిఫలము జెప్పి యాత్రతతో నిరీక్షించియున్న నాకానంద మొనగూర్పుఁడ"ని ప్రార్థించెను. అతఁడును హస్తమును మరల పరీక్షించి సాముద్రిక శాస్త్రప్రకారము నీకచిర కాలములో కావలసినదాని కెక్కుడగు కాంచనము నీయింటనుండును. అని చెప్పి తనమూటలో నున్న పదిబంగారు దీనారములఁ దీసి యామెకొసగి పాలు పంచదారయు నరటిపండ్లును దెప్పింపుము. ఈదినమున దేవీసమారాధన మొనరించి నీజాతకమున నేమియుండెనో తెలసికొందునని యెను. వేశ్యమాతయు స్వల్పధనంబుతో యోగికి వలయు వస్తువుల దెప్పించి యోగికి సమర్పించి మిగిలినధనమును తనస్వంతఖర్చున కుపయోగించుకొనెను

మరునాఁడు యోగి వేశ్యమాతకు శుభఫలమును జెప్పి పంపివేయుచు మరుచటి శుక్రవారమున మరలరమ్మనెను. ఆదినమునను పది దీనారములనొసఁగి వెనుకటివస్తువులనే దెమ్మని నియోగించెను. ఆవేశ్యమాత సుమారు తొమ్మిది దీనారముల మిగుల్చుకొనియెను. ఇట్లు నాలుగైదు వారములు గతించెను. వేశ్యమాత మిక్కిలిగా నక్కజపడియెను.

వేశ్యమాత గృహంబునకేగి కుమారికతో నిట్లనియెను. అమ్మాయీ యోగి యష్టసిద్ధులను బొందినవారివలె నున్నాడు. ఎట్టివారియొద్ద నుండియు ధనంబు గైకొనఁడు. ప్రతి శుక్రవారమును పదిపండ్రెండు దీనారముల పాలకై పంచదారకై వెచ్చింపుచుండెను. ఈతనిస్థితిజూడ స్వర్ణయోగము నెఱిఁగినవానివలె నున్నాడు. అని చెప్పి యూరకుండెను.

యోగీశ్వరుని ప్రతిభ యూరంతయును బాకి తుట్టతుదకు రాయలకుఁగూడ తెలియవచ్చెను. ఆతనిని జూడఁగోరి రాయలరుదెంచెను. యోగియు యాతనిమన్నించి జ్యోతిషమునజూచి యాతనిమనోవాంఛిత ములలోఁ గొన్ని స్వల్పకాలములో నీడేరుననియు జెప్పెను. రాయ లతని దివ్యజ్ఞానమునకు సంతసించి వేయిదీనారముల నొసంగఁబోయెను. యోగి వానిని నిరాకరించి తనకు ధన మగత్యము లేదనియు తనయొద్ద స్వర్ణ యోగమున్నదనియు జెప్పి యాతని సంతుష్టిపరచి పంపివైచెను.

విలాసవతితల్లి యాపల్కులనాలించి జరిగిన వృత్తాంతమంతయును కుమార్తె కెఱిఁగించెను. అంత విలాసవతియు యా యోగివద్దనుండి స్వర్ణయోగమును నేర్చుకొని బంగారమమితముగా కూర్పవలయునని తలఁచి తల్లితో నిట్లనియెను. "అమ్మా ఆ యోగిపుంగవుని మన యిం టికి దోడ్తెమ్ము పిమ్మట నా నేర్పుజూపి యాతనివంచించి యా యోగ మును నేర్చుకొందును." ఈపల్కుల కలరి వేశ్యమాతయు యోగి యొద్ద కరిగి "స్వామీ! యిచ్చట తమరు నివసించుట బాగుగాలేదు. మాగృహము కడు విశాలమైనది. తమ రందు విశ్రమించి యేశ్రమయు లేక జపతపంబుల నిర్విఘ్నముగా నొనరింపవచ్చు" నని విన్నవించెను. అందుల కాయోగిపుంగవుడు మున్ముందు సమ్మతింపక యెట్టకేల కామె మాటఁ ద్రోసివేయజాలక వల్లెయని యంగీకరించెను.

ఆ వేశ్యమాతయు నాతని నొక్కగదిలోనికిఁ దోడ్కొనిపోయి యందాతనికిఁ గావలసిన పరికరములనుంచి వలచిన పరిచర్య లొనర్చు టకు తనకుమార్తెను నియోగించెను ఆ విలాసవతియు యాతని మ్రోల సాక్షాత్కరించిన దివ్యాంగనవోలె నటించుచు వివిధవిధంబుల నాతని తన వలలోఁ దగుల్కొనునట్లు జేయ యత్నించుచుండెను. ఆమె యొక్కొ క్కపరి యొయ్యారముగా నడచుచు సర్దుకొలఁదినిదిగజారు పయ్యెద సవ రించు నెపంబున గబ్బిగుబ్బల యుబ్బుకొంత యోగికిఁ గన్పరచుచు విలాస

ముగా నాతని చెంతజేరి వినోదముగా పురాణగాథల నాలించుచు, వింత వాదముల జేయుచు, స్వర్ణయోగమునుగూర్చి ప్రశ్నించుచు- యయ్యది తనకు దెలిసిన బాగుగానుండుననియు జెప్పుచు నాతనికట్టెకుటనే నిద్రాహారములనైన లెక్కగొనక నటింపుచుండెను.

ఒక్కనాడు యోగి స్నానార్థ మరిగిన పిదప విలాసవతి యాతని వ్యాఘ్రాజినముపై బరుండెను. అప్పటి యామెస్థితి జూచిన నెవరేని "యినుపకచ్చడాల్ గట్టుకొను మునుముచ్చులైన తామరసనేత్రలిండ్ల బందాలుగారె" యను సామెతకు లోనై మోహావేశమున నామెపై బడ నుంకింతురు. ఇంతలో యోగి యామె వెనుకనుండి ప్రవేశించి యామె సౌందర్యమున కచ్చెరువొంది.

మ. వరబింబాధరమున్ పయోధరములున్ । వక్రాలకంబుల్ మనో
హరలోలాక్షులు జూప కవ్వలి మొగం । బైనంత నేమాయె నీ
గురుభాస్వజ్జఘనంబు గొప్పముడియు మా । కుంజాలవే గంగక
ద్దరి మేలిద్దరి కీడునుంగలదె యు । ద్యద్రాజబింబాననా?

అను పద్యమును జనువునప్పటికి విలాసవతి యాతండెవ్వడో తన్ను పరీక్షింపవచ్చిన పూరుషుడని యెఱిగి గిరుక్కున లోనికేగెను. యోగి యంతర్థానమయ్యెను.

మరునాడు మరల రాయల యాస్థానమున రామకృష్ణు డరుదెంచి యిట్లు క్రిందిసమస్య నొసంగెను

* * * గంగక

ద్దరి మేలిద్దరి కీడునుంగలదె? యుద్యద్రాజబింబాననా!

దాని నాలించి యెల్లరును పూరించిన రామకృష్ణు డాక్షేపించునని భావించి యూరకొనియుండిరి. అంత రాయలు తనకును బూరించు టెట్లో తెలియకుండుటను రామకృష్ణా! నీసమస్యలను నీవే పూరింప

వలయునుగాని యితరులెల్లుపూరింప సమర్థులు నీవేపూరింపుమని యెను. అంత రామకృష్ణుఁడు,

మ. వరబింబాధరమా పయోధరములున్ వక్రాలకంబుల్ మనో
హరలోలాక్షులు జూప కవ్వలి మొగంబైనంత నేమాయె నీ
గురుభాస్వజ్జఘనంబు క్రొమ్ముడియు మాకుంజాలవే గంగక
ద్దరి మే లిద్దఱి కీడునుంగలదె యుద్యద్రాజబింబాననా.

అనిచదివి యట్టహాసముగా నియ్యది స్వర్ణయోగ చింతామణి లోని వ్యాఘ్రాజినఘట్టమున యోగభోగినీ సంవాదములోనిద నెను. ఎల్లరును పకపక నవ్విరి. రాయలు రామకృష్ణునిజూచి సంగతి సవిస్తరముగా దెల్పుమని ప్రశ్నించెను. అంత రామకృష్ణుఁడు విలాసవతితో జరిగించిన కథయంతయు దెల్లముగా నెఱిఁగించెను.

అంత నెల్లరును సంతసించి యాతని ప్రజ్ఞావిశేషమునకు బొగడిరి. రాయలు రామకృష్ణుఁడతనిపంతము నిర్వహించుకొనెనని తలఁచి బహూకరించెను.



## పాతివ్రత్యప్రదర్శని.

రాయల యాస్థానమున కొక్కపండితుఁడు తాను శ్రమపడి రచించిన పాతివ్రత్యప్రదర్శనమను గ్రంథరాజమును గొనివచ్చి రాయలతో నిట్లనియెను "దేవా! తమరీగ్రంథమును కృతిగొనవలెను. ఇట్టి గ్రంథ మీవరకు రచింపబడి యుండలేదు." రాయలు కృతి వినినపిదప సమాధాన మిచ్చెదనని చెప్పి మరునాడు గ్రంథమును దీసికొని రమ్మనెను.

రాయలను దర్శింపబోవు ప్రతికవియు మున్ముందుగా పెద్దనామాత్యుఁడు మున్నగువారి నాశ్రయించి వారలకు దమగ్రంథమును

జూపి వారలచే వలసిన సవరణల జేయించుకొని వారలయనుగ్రహమున రాయల దర్శించుచుండిరి. కాని యీకవీశ్వరుఁడు తనకవిత్వమున తప్పు లుండవనియు నీచుల నాశ్రయించుట కానిపనియనియుం దలచి రాయల యొద్దకు స్వయముగా బోయెను. దాన గినిసి యెల్లరును రామకృష్ణుని ప్రబోధించి యాగ్రంథము రాయలు కృతిగొనకుండునట్లు జేయుమనిరి. రామకృష్ణుడు వల్లెయని సమ్మతించెను.

సభారంగమున నెల్లరును సుఖముగా నాసనములపై గూర్చుండి గ్రంథము నాలించుటకు సిద్ధముగానుండిరి. రాయలు గ్రంథమును జదువుటకు ప్రారంభింపవచ్చునని యెఱిగించెను. కవీశ్వరుఁడు మంగళాచరణమును గావించి పిమ్మట పుస్తకమును విప్పి చదువసాగెను. కృతిపతి నాశీర్వదించుట-దైవప్రార్థన- గలలో పూర్వులు గన్పడి తన్ను గ్రంథరచనకు బురికొల్పుట-కవిస్తుతి-కృతిపతివర్ణన-షష్ఠ్యంతములును జదివెను. పిమ్మట కవీశ్వరు డీక్రింది సీసపాదమును జదివెను.

"సీ. పతికి మాఱాడక । బలుమరు నేడ్వక
యలియక మిగుల గ। య్యాళిగాక"

రామకృష్ణు డంత చటాలునలేచి "దేవా! తమ రీపుస్తకమును కృతిగొనవద్దు. ప్రథమపద్యమునే మంటగలపినాడు." అనిచెప్పి యాపద్యపాదమున కిట్లని యర్థము జెప్పెను.

పతికిమాఱాడక:—భర్తకుఁ బ్రత్యుత్తరమీయక మొగుడడిగిన ప్రశ్న కుత్తరమీయకున్న మితభాషిణికన్నను మిన్నయగుమువు.

పలుమరు నేడ్వక:—పెక్కుసార్లు ఏడువరాదు. కొద్దిగా, ముక్తసరిగ మూడు నాలుగైదుసార్లేడువవలెను. కొంతయేడుపుస్త్రీకి విధి.

అలియక:—శరీరము నాయాసపెట్టక ఏపనిజేసినను శరీర మలియును. కనుక ఏపనియును జేయకుము.

మిగులగయ్యాళిగాక:—ఎక్కువగా గయ్యాలితన ముండగూడదు. కొం

చెము గయ్యాళితన ముండితీరవలయును.

ప్రహా ప్రభూ! ఏపాతివ్రత్యప్రదర్శనయు లేక నే లోకమున పూరు

షులు స్త్రీల కులొంగి వారల యిష్టమునకు బాత్రులగుచున్నారు. ఈ

గ్రంధమును జూచినచో పూరుషుల కింక బతుకు తెరవు లేదు. కాన ఈ

పుస్తకమును కృతిగొనవద్దని యాటంకపరచెను. రాయలు మరియొక

ప్పుడు చూడవచ్చునని సభ నిలుపుచేసెరు.

## సమస్య.

కృష్ణరాయలు కవీశ్వరుల కీక్రింది సమస్య నొకనా డొసంగెను.

వి, స్ఫురితఫణామణిద్యుతుల । బొల్పగునాగకుమారుడోయనన్.

అంత యల్లసాని పెద్దనామాత్యుడు లేచి యాశువుగా నాసమస్య

నిట్లు పూరించెను.

చ. వరు(డుచెరంగుపట్టినను । వల్వదొరంగిన లేమసిగ్గుప

ట్టురుతరరత్నముద్రికల । నొప్పగు డాపలికేల మూయగా

గరమమరెం గరం బపుడు । కామనిధానము కాచియున్న వి

స్ఫురితఫణామణిద్యుతుల । బొల్పగు నాగకుమారుడోయనన్.

అంత నాతని రాయ లమితముగా బహూకరించెను.

## రాధామాధవకవి.

రాధామాధవుడను కవిశేఖరుడు పెద్దనాదుల నాశ్రయించి

రాయలదర్శనము చేయింపుమని కోరెను. రాయల సందర్శనము చేకూ

రెను. రాయ లాతనిజూచి "కవిశేఖరా! నగరు, తగరు, తొగరు, వగరు

యనుపదముల ప్రాసస్థానముల నిలిపి భారత భాగవత రామాయణ

పరముగా మూడు పద్యములు చెప్పు" డనియెను.

రాధామాధవకవి యాశువుగా నీమూఁడుపద్యముల జెప్పెను.

రామాయణార్థపరముగా:—

చ. నగరుపగాదె నింక విపినంబుల కేగుము రాజ్యకాంక్షకున్
దగరు కుమారులార యని తల్లి వగల్మిగులంగఁ దోపఁగాఁ
దొగరున రక్ష గట్టి మది దోఁపక గద్గదభిన్నకంఠుఁ డై
వగరుచుచున్నఁ జూచి రఘువంశవరేణ్యుఁడు తల్లి కిట్లనున్.

భారతార్థమువచ్చునట్లు చెప్పిన పద్యము:—

చ॥ తొగరుచికన్నుదోయిఁ గడుఁ గోఁపఁగఁ గర్ణుఁడు భీమసేనుపైఁ
దగరు ధరాధరంబునను దాఁకిన భంగిని దాఁకి నొచ్చి తా
వగరుచుచున్ బరగు వారిన నచ్చటి రాజలోకముల్
నగరు సుయోధనాజ్ఞ మది నాటుట జేసె ధరాతలేశ్వరా!

భాగవతార్థము వచ్చునట్లు చెప్పినపద్యము.

చ. వగరుపుమాత్రమే వరుఁడు వశ్యుఁడు గాఁడు నఖీనఖిత్వమె
న్న గరుడవాహనుండు మము వాఁడటు డించుట యెల్ల వాసవా
తగరనికాక మోహపుల తాతవులైన విడంగ జూతురే
తొగరుచి మోహపథేశునకు దోపఁగఁ జేయునె పీడవాడఁగన్.

ఆతని యాశుధారాశక్తికిని కవితామాధుర్యంబునకు కడుం గడు సంతసించి బహూకరించి తనవద్దఁ గొంతకాలము నిలుపుకొనియెను.

## పారిజాతాపహరణము.

నంది తిమ్మనార్యుఁడు పారిజాతాపహరణమును రచించుటను గూర్చి యీయితిహాసమును జెప్పెదరు.

రాయలవారి పట్టమహిషియగు తిరుమలదేవి యొక్కనాఁటి రాత్రి చాలభాగమువఱకును రాయలు వచ్చునను పేరాశతో వేచి

యుండెను. "*రాయలు రాలేదు. అర్ధరాత్రము మీఱవచ్చుచున్నది. మన్మథుఁడా నను బాసిపోఁడు" అని వితర్కించుచు ప్రతినిమేషమును నాథుఁడు వచ్చుచుండె నేమోయని మాటిమాటికిని గవాక్షము జేరి చూడుమని చెలికత్తెను బుత్తెంచుచుండెను.

రాయలు చిన్నాదేవితోఁ గ్రీడించుచు తనమాటయే మఱచియుండెనను విచారముతో తల్పముపై శయనించెను. చెలికత్తెయు నిద్ర యపరిమితముగా తన్నావహించుటఁజేసి నిష్క్రమించెను. పిదప కొన్ని నిమేషములకు రాయ లరుదెంచి యామెకు నిద్రాభంగము చేయుట కిష్టములేక శయ్యాతలము సమీపమున పాదములవైపువ నున్న యొక పడకకుర్చీపై గూరుచుండెను. తిరుమలదేవి కలత నిద్దుర జెంది యటునిటు గదలెను. అట్లు కదలుటలో యామె పాదములు రాయలకు దగిలెను.

అంత రాయలు మహాగ్రుఁడై లేచి నిలువబడి యామెపై తూక్షవీక్షణముల బరపుచుండెను. అంత తిరుమలదేవి మేలుకాంచి యాతనిపాదములకు నమస్కరించి సమీపమునకు చేరబోయెను. అంత రాయలు తనకోప ముపసంహరించుకొనలేక "నన్ను పాదంబుల దన్ని యిట్లు నక్కవినయముల జూపనేల ? పో పొమ్మ"ని దూరముగా ద్రోచి యంతఃపురము వీడి యరిగెను.

తిరుమలదేవియు కడుంగడు చింతనొంది యుదయముననే తన యవస్థనంతయు నంది తిమ్మనకు నెఱిగించెను. (నంది తిమ్మన యరణపు కవీశ్వరుఁడుగా తిరుమలదేవితో నరుదెంచి యుండెను.) తిమ్మనయు

* శ్లో॥ పీటీకరాగాగ్రి విరహాతురాంగీ । చేటీమవాదీ దిహచిత్తజన్మా
ప్రాణేశ్వరో వా జీవితమర్ధరాత్రం । మాయాతి నాయాతి నయాతి॥

"అమ్మా చింతింపవలదు. తేను నీయందు మరల బద్ధానురాగుఁ డగు నట్లు చేసెద" నని సమాశ్వాసించి వెడలిపోయెను.

* * * * * *

నేఁడు రాయలసభ నత్యధికముగా నలంకరింపఁబడి యుండెను. కవీశ్వరులు సామంతులు రాజకీయోద్యోగులు మున్నగువార లుచితాసనములపై గూరుచుండిరి. రాయల రాక కెదురుచూచుచుండిరి. మఱి రెండుమూఁడు నిముషములలో రాయ లరుదెంచుచున్నాఁడను కలకలము- అయ్యదిగూడ యడంగెను.

ఇంతలో ముద్దుపల్కుల ముక్కు తిమ్మనార్యునితో రాయలవా రరుదెంచి వారలకై ప్రత్యేకముగా నుంపఁబడిన యాసనములపై గూరుచుండిరి. తిమ్మనకవీశ్వరుఁడు వేదోక్తముగ రాయల నాశీర్వదించి తదుపరి తాను రచించిన పారిజాతాపహరణమును జదువ నారంభించెను. సభ్యు లెల్లరును నానందపారవశ్యమున దేలియాడుచుండిరి. కృష్ణరాయలు ముక్కు తిమ్మనార్యుని పల్కులు ముద్దుల మూట లని యెడనెడ గీర్తించుచు తన సంతోషమును వెల్లడించుటకు చిరునవ్వు కిరణంబుల బరపుచుండెను.

ఉ. పాటలగంధి చిత్తమునఁ । బాటిలు కోపభరంబు దీర్ప నె
ప్పాటను బాటుగామి మృదు । పల్లవకోమల తత్పదద్వయీ
పాటల కాంతమాళి మణి । పంక్తికి వన్నియ వెట్ట నాజగ
న్నాటకసూత్రధారి యదు । నందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్.

ఆశ్చర్యమున రాయలు ముందేమి జరిగిన దని ప్రశ్నించెను. తిమ్మన చదువుచుండెను.

మ. జలజాతాసన వాసవాది పురపూ । జా భాజనంబై తన
ర్చు లతాంతాయుధుకన్నతండ్రి శిర మచ్చో వామపాదంబునన్

దొలగం దోసె లతాంగి యట్లయగు నాథుల్ నేరము ల్సేయ బే
రలుకం జెందినయట్టి కాంత లుచిత వ్యాపారము ల్నేర్తురే.

అను పద్యము నాలించి తాను తిరుమలదేవియెడ జూపిన పరాఙ్ముఖత యకారణమైనదనియు చింతించి సభ చాలించిన పిదప తిరుమలదేవి యంతఃపురమున కేతెంచెను.

పతివచ్చు వార్త నాలించి తిరుమలదేవి సర్వాభరణ భూషితురాలై యాతని కెదురుగా జనుదెంచి కైదండయొసగి లోనికి దోడ్కొనిపోయెను. అంతటినుండియు వా రిరువురును యానందతరంగముల దేలియాడు చుండిరి.

రాయలు పారిజాతాపహరణమును కృతిగొనియెను.

## ధూర్జటికవి.

కృష్ణరాయలునకు ధూర్జటికవిపై నధికమైన యభిమానము. అతని మనోహరపదలాలిత్యమున కలరి యాశ్చర్యమభినయించుచు ప్రస్తావనవచ్చినప్పుడెల్లను యిట్లు పొగడుచుండెను.

స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కులకేల గల్గెనో
యతులిత మాధురీమహిమ....................

ధూర్జటికవి పైకి శోత్రియునివలె గాన్పించునుగాని యాతని గుణానువర్తనము లతిరహస్యములు. ఈతఁడు వేశ్యలయం దభిమానము గలవాఁడు. వేశ్యలపొత్తుగోరి విత్త మనేకవిధముల వమ్ముచేయుచుండెడివాఁడు. ఎట్టి వేశ్యవచ్చినను యీతనిదర్శించి యీతనిచే మన్ననలంది ధనలాభమునుబొంది వెడలిపోవుచుండుట వాడుక. దినదినంబునకు వయసు నాతనికి వేశ్యలపైగల నాసక్తి యధికమగుచుండెను. ఎందఱెన్నివిధముల మందలించినను వినక వేశ్యలకై ధనమును పాడుచేయుచుండెను.

పెద్దనాదికవులెల్లరును రామకృష్ణునియొద్దకేగి "ఓయీ ధూర్జటి కవికి వేశ్యపై ననురాగము మెండని నీవెఱుంగుదువుగదా! ఆతడొక్క దినమున వెచ్చించినధనముతో మనబోటి సామాన్యకుటుంబములు వత్సరమువఱకు హాయిగా కాలక్షేపవ జేయుటకు సరిపడును. ఎట్లైనను యీతని బాగుపరచుట మంచిది. ఎవ్వరుచెప్పినను పెడచెవి నిడుచున్నాడు గాని రాయలచే జెప్పించినచో మానునని యభిప్రాయ పడుచున్నాము. రాయల కీసంగతిదెల్ప నీవే సమర్థుడవని ప్రోత్సాహపరచిరి. రామకృష్ణు డంగీకరించెను.

మరునాడు సభలో మరల రాయలు ధూర్జటికవినిజూచి—

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కులకేల గల్గెనో
యతులితమాధురీమహిమ...

యనిచదివి యూరకుండెను. వెంటనే రామకృష్ణుడులేచి, దేవా నేనుతెల్పెద నాలింపుడు.

చ. స్తుతమతియైన యాంధ్రకవి। ధూర్జటిపల్కులకేల గల్గెనో
యతులిత మాధురీమహిమ। హా తెలిసెన్ జగదేకమోహనో
ద్ధతసుకుమారవారవని। తాజనతాఘనతాపహారసం
తత మధురాధరోదిత సుధారసధారల గ్రోలుటం జుమీ.

అని పూర్తిచేసి ధూర్జటి గుట్టు వెల్లడించెను. రాయలాశ్చర్యపరవశుడై యప్పటికూరకుండెను. ధూర్జటి చిన్నబుచ్చుకొని తలవాల్చుకొనెను. పిమ్మట రహస్యముగా ధూర్జటిని మందలించి యాతని నా దుర్వ్యసనమునుండి గాపాడెను.

## అల్లసాని పెద్దనామాత్యుడు.

ఒకానొకప్పుడు కృష్ణదేవరాయలు సభలో నీక్రింది రెండుపాదములను చదివి వేరొకవని చూచుచుండెను. కవీశ్వరు లేమనిచెప్పుటకు

ను దోపక చూచుచుండి తమ్ము పూరింపమని చెప్పనందున పూరించిన నెట్లు వచ్చునోయనియు పూరింపవలసిన నేమిచెప్పవలయునో యనియు నాలోచించుచుండిరి. రాయలు పని ముగించి మరల యారెండుపాదముల నిట్లుచదివెను.

కలనాటి ధనము నక్కఱ
కలనాటియు కలిమిలేమి । గలకాలంబుల్

అని యూరకుండి పెద్దనవైపు జూచెను. అంత పెద్దన యీక్రింది విధమున బూరించెను.

కం. కలనాటిధనము నక్కఱ
కలనాటియు గలిమిలేమి । కలకాలంబుల్
నెలనడిమినాటి వెన్నెల
యలవడునే కాదె పోమె । నమవసనిశికిన్.

అంత నాపద్యమునాలించి రామకృష్ణుడు వికటాట్టహాసము జేసి "పెదనా! ఏమిటీకవిత్వము. ఎంతచక్కగా చెప్పితివి.

క. ఎమి దిని సెపితివి కవితము
భ్రిమపడి వెఱిపుచ్చకాయ । వడి దిని సెపితో
యుమెత్తకయ దిని సెపితో
యమవసనిసి యన్నమాట । యలసని పెదనా"

ఇట్టీతఁడాక్షేపించినను యీతనికి పెద్దన్నపైగల యభిమానము మెండు. అందులకు నిదర్శనముగా నీతని యీక్రిందిపద్యము సాక్ష్యమిచ్చుచున్నది.

కం. కవి యల్లసాని పెద్దన
కవి తిక్కనసోమయాజి । గణుతింపంగా
గవి నేను రామకృష్ణుడ
గవి యను నామంబు నీటి । కాకికి లేదే.

వేరొక సందర్భమున యల్లసాని పెద్దనామాత్యునిపై గలయభిమానమును వెల్లడించుచు యాతనికవిత్వము నిట్లు పొగడి యున్నాడు.

ఆ. వె. అల్లసానివాని । యల్లికజిగిబిగి
ముక్కుతిమ్మనార్య । ముద్దుపలుకు
పాండురంగవిజయు । పదగుంభనంబును
గాకమానురాయ । నీకతగుర.

---

# కవిత్రయము

రాయలు సభాస్థలంబుననుండి యొక్కనాడు పెద్దనామాత్యుని, భట్టుమూర్తిని, ముక్కుతిమ్మనార్యుని జూచి వారలతో నిట్లనియెను. సూకరమును, తామరపాకుమీది నీటిబిందువును, కుక్కుటమును గూర్చి వర్ణింపుడనెను. అంత నాముగ్వురును జెప్పిన పద్యముల నీక్రిందఁ బొందు పరచుచున్నాను.

శా. రంతుల్మానుము కుక్కుటాధమ దరి । ద్రిష్టుప్రశూద్రాంగనా
ప్రాంతోలూఖల మూలతండులకణ । గ్రాసంబుచేఁ గ్రొవ్విదు
ర్ధాంతాభీలవిశేష భీషణఫణాం । తర్మాంసనంతోషిత
స్వాంతుండై నఖగేంద్రుకట్టెదురనీ । జంజాటముల్ సాగునే?

ఉ. తెక్కెక నేల ముట్టెగొని । త్రివ్వగ నేర్తునటంచుఁ దాకుతా
వొక్కెడు జాతియంచు ముద । మొందకు బుద్ధిని వెఱ్ఱిపంది నీ
వెక్కడ యాదిఘోణియన । నెక్కడ యద్రినముద్రిదుర్గభూ
ర్భ్యక్కతలంబు నొక్కయర । పంటను మింటికి నెత్తనేర్తువే!

ఉ. స్థానవిశేషమాత్రమున । దామరపాకున నీటిబొట్టు నిర్
బూనిక మౌక్తికంబనుచు । బోల్చినమాత్రన యింతగర్వమా ?

మానవతీశిరోమణుల । మాలికలందున గూర్పవత్తువో
కానుక లీయవత్తువో వి । కాసము నిత్తువో విల్వదెత్తువో!

ఆపద్యముల నాలకించి రాయలు సంతుష్టిజెంది వారలకు విశేష ముగా బహూకరించెను.

---

# పాండవప్రశంస

రాయలు దిగ్విజయ మొనర్చుచు నొక్కచో విశ్రమించి వినోద ముగా గాలముగడుపుచు నొక్కనాడు పండితసభగూర్చి ముచ్చటించు చు పాండవు లెక్కువవారా దాశరధు లెక్కువవారా యని ప్రశ్నిం చెను. ఎల్లరును శ్రీమహావిష్ణునంశమున జన్మించిన దాశరధులే యెక్కు వవారలని వచించిరి. మరికొందఱు పాండవులే యెక్కువవారనిరి. అంత రాయ లిట్లనియెను. శ్రీరామాదులు విష్ణువుయొక్కయవతారములగుటచే వారలు గొప్పవారలగుటకేమియును సందియము లేదు కాని దేవాంశ సంభవులు గానట్టి పాండవులు దేవాంశసంభవులగు రామాదులతో తు ల్యులనదగినవారలు గావున నాదృష్టికి పాండవులే యెక్కుడువారలనె ను. ప్రక్కను చామరమువీచుచున్న నొక్కచాకలివాడు "దేవా! జన్మాంతరముననున్నను పాండవులపైగల యభిమానము పోలేదుగదా" యనెను. ఆమాటలకును వాని సమయస్ఫూర్తికిని మెచ్చి నీకావల యునది కోరుకొమ్మనెను. అంత నాచాకలి "దేవా! దేవరకోట యేలవ లెనని యున్న"దనెను. వానికోర్కెప్రకారము దేవరకోటలో నొకదు ర్గమునుగట్టించి వానిని దాని కధికారిగా నొనర్చెను. ఇప్పటికిని యా పట్టణమున చాకలివాండ్రు పల్లకుల మోయరట

---

## ప్రెగ్గడ నరసరాజు

కృష్ణదేవరాయల యాస్థానమున కొక్కనాడు ప్రెగ్గడనరస రాజను కవిశేఖరుఁ డరుదెంచి "దేవా! భువనవిజయమను తమసభ యందు పెక్కువిద్వాంసులు గలరనియు వార లెక్కుడు సమర్థులనియు విని వారలనోడించి బిరుదు లందవచ్చితిని. ఉభయభాషాకవిత్వప్రయోగకుశలుఁడను. చతుర్విధకవిత్వములను జెప్పగలవాడను. మంచి వ్రాయసకాడను. విమర్శకుడను. సభ జేయించినచో తేటపడగలదు." అని సగర్వముగా బలికెను. రాయ లందుకు సమ్మతించి యాతని బంపి వేసెను.

మరునాడు సభలోన పెద్దవారులతో ప్రసంగము గావింపబడెను. ఆదినంబున జయలక్ష్మి మాధ్యస్థముగనే నిలచియుండెను. మరునాటికి సభ నిలుపుచేయబడెను.

ఆదినంబురాత్రి పెద్దవారలెల్లరును రామకృష్ణునియొద్ద కేగి రామకృష్ణా నరసపాండిత్య మపారము. నేము మాకవమానము సిద్ధింప వలసినదిగాని యాశారదాదేవికృపవలన నంతవఱకు రాలేదు. ఈతని జయించి గర్వముడిపి పంపివేయుటెట్లా యని యాలోచించి నీవే సమర్థుఁడవని తలచి నీయొద్ద కరుదెంచితిమి. భువనవిజయమను పేరు పోకుండ నిలుపవలయునని చెప్పిరి.

అంత రామకృష్ణుఁడు పెద్దవారులతో నిట్లనియెను. "మీకంటె నే నెక్కుడు ప్రజ్ఞగలవాడనుగాను. అయినను నానేర్పు మెంపున యాతని వంచించి జయంబుగొందును."

మరుచటిదినంబున సభ కేర్పాటు జేయుటడెను. అందఱు నుచితాసనములపై గూరుచుండిరి. రాయలుకూడ పండితవాదమును విన వేడ్కతో నిర్ణీతకాలమున కించుకముందుగనే వచ్చెను. పిదప పెద్దవారులు రాయల

తో నిట్లనిరి. "ఈదినంబున రామకృష్ణకవిశేఖరుని ప్రత్యర్థి పండితునిగా నియమింపవలయును." రామకృష్ణుఁడు ప్రత్యర్థి పండితుఁడుగా నియమింపబడెను. రామకృష్ణునకును నరసరాజునకును జరిగిన ప్రసంగములోని ముఖ్యాంశము లియ్యవి.

రామ—వేనియందు పరిశ్రమ యెక్కువ? కవిత్వము చెప్పగలవా?

నరస—గంటకు వేయిపద్యముల జెప్పగలను. మంచివ్రాయసకాడను. విమర్శనమునం దపారప్రజ్ఞ గలదు.

రామ—గంటకు లక్షలకొలది పద్యముల జెప్పగలను. దానికేమి. మంచివ్రాయసకాడ నంటివి. నే కవనము జెప్పుచుండ నవ్వాగు మనక వ్రాయగలవా?

నరస—నాకల మాఁగకుండ కవిత్వము జెప్పినజాలు.

రామ—వ్రాయుటకు సిద్ధముగా నుండుము.

ఇట్లాసువుగా నొక్కపద్యమును రచించి వికృతముగా ధ్వనిచేయుచు వ్రాయుట కిసుమంతయేని సులువులేనట్లుగా నిట్లు చదివెను.

క. త్రువ్వట బాబాతలపై
బువ్వట జాబిల్లి వల్వ । బూచుట చేదే
బ్రువ్వటఁ బూడగ నఃభఖ
క్కవ్వట యరయంగ నిట్టి । హారునకు జేజే॥

రామకృష్ణుఁ డొనర్చిన యీ వికటోచ్చారణ ననుసరించి నరసరాజు వ్రాయజాలక కష్టపడి పైవిధమున వ్రాసెను. రామకృష్ణుఁడు పద్యమును జెప్పి కొన్నినిమేషము లూరకుండవలసెను. పిమ్మట రామకృష్ణుఁడు "వ్రాయసకాడను బిరుదమూఁడినదా" యని పరిహసించి యాక్రిందిపద్యమును జదివి వివరింపుచు..

మ. కనసీహారగురామ పద్మధళరంగత్కీర్తి చానూరమ
 ర్ధన శుక్రాక్షీకశేధ రాణ్నగపతీత్రైలోక్యదామోదరా
 యనగాశంకర వాంఛితార్ధకృప ది । వ్యాస్త్రోకపాణీజనా
 ర్దనవానేకపవైరి విగ్రహముకుందా మిత్రవిందాధిపా!

నరసరాజాపద్యమునందలి యక్షరములకు "ఒత్తు" లలోగొన్నిటిని దీసివేసి వీట్లలో గొన్నిటికి దగిలించెను. అంతటితోఁ దృప్తినొందక కొన్నిమార్పులను గూడ జేసెనట.

అంత రామకృష్ణుఁడు కోపమున "ఓయీ తెలివితక్కువవాడవై లేని దోషములను జూపి యాక్షేపణ మొనరింప సిద్ధపడితివా! నీకుఁ దెలియనివి తప్పులనియే భావించితివా! నాపద్యమునకు నేన యర్థము జెప్పవలయునుగాని నీబోంట్లు పనికిరారు" అని తన పద్యమున కర్థము జెప్పి యాతని నిట్లని రెండుతిట్టుపద్యములతో నాశీర్వదించెను.

చ. తెలియనివన్ని తప్పులని । దిట్టతనాన సభాంతరంబునన్
 బలుకగ రాకురోరి పలు । మారు పిశాచపుపాడగట్ట నీ
 పలికిన నోట దుమ్మువడ । భావ్యమెఱుంగక పెద్దలైనవా
 రల నిరసింతురా ప్రెగడ । రాణ్ణరసా విరసాతుసాబుసా.

చ. ఒకని కవిత్వమందెనయు । నొప్పులు తప్పులు। నాకవిత్వమం
 దొకనికి తప్పుబట్ట పని । యుండదు కాదని తప్పుబట్టినిన్
 మొకమటుక్రిందిగా దిగిచి । మొక్కలుపోయిన నుంపకత్తితో
 సికమొదలంట గోయుదును । జెప్పునగొట్టుదు మోముదన్నుదుగ్.

అని రూక్షవచనంబుల నరసరాజును దిట్టుచుండ రాయ లాతని శాంతపరచి నరసరాజుతో నిట్లనియెను. "ఓయీ! నీవు డంబములు పలుకకున్న నీకు తగుపాటి గౌరవము లభించియుండును. నీ గర్వము చేతనే యింతవచ్చినది." యని యాతనిగూడ శాంతపరచి పంపివేసి నాటికి సభ ముగించెను.

---

# రత్నముల పళ్లెరము.

కృష్ణదేవరాయ లొక్కనాడు పాటంబుగ నొక్క రత్నముల పళ్ళెరమును దెప్పించి తనపై నొక్కపద్యము జెప్పినవారికి పళ్ళెరమును, యందున్నరత్నములను బహుమానముగా నొసంగెదనని చెప్పెను. వెంటనే పెద్దన్నగారు లేచి

(అర్థ మనుబంధమున నీయబడెను)

శరసంధానబలక్షమాని వివిధై । శ్వర్యంబులం గల్గి దు
ర్భరషండత్వబిలప్రవేశ చలనబ్ర । హ్మఘ్నత ల్మానినన్
నరసింహక్షితిమండలేశ్వరుల న । న్నన్ వచ్చు నీసాటికా
నరసింహక్షితిమండలేశ్వరుని కృ । ష్ణా రాజకంఠీరవా.

అని చెప్పిన విని రాయ లపరిమితానందము నంది యాంధ్రకవితాపితామహా యల్లసాని పెద్దనకవీంద్రా రమ్మని యాతనిబిల్చి యాపళ్ళెర మందిచ్చెను. అంత రామకృష్ణుఁడు లేచి వికటాట్టహాసముతో "రాయలవా రెన్నిగుహలలో దూరినారు రాజకంఠీరవులగుటకు! నేను పద్యము జెప్పెద నందు తప్పు జూపుము." అని యీక్రింది పద్యమును జెప్పెను.

మ. కలనం దావకఖడ్గఖండిత రిపు । క్ష్మాధర్త మార్తాండమం
డలభేదంబొనరించి యేగునెడ ద । న్మధ్యంబునన్ హారకుం
డలకేయూరకిరీటభూషితుని శ్రీ । నారాయణుం గాంచి లో
గలకం బారుచు నేఁగె నీవయనుశం । కం గృష్ణరాయాధిపా!

అనిన యాపద్యము నాలకించి యందు దప్పులేకుంట జేసి పెద్దన్న రత్నములపళ్లెర మాతని కందించెను ఆత డద్దానిని గైకొనక పెద్దనా! నీకవిత్వ మాక్షేపించుటకు వీలుగనుండునా! నేనుగూడ పద్యము జెప్పనట్లెంటిని. పళ్లెరమును నీవే తీసికొనుము. రాజకంఠీరవా యనునది శ్లేష్మవాచకముగాదా! యని చెప్పి యాతని సంతుష్టి

పరచెను. రాయలు వేరొక పల్లెరమును దెప్పించి రామకృష్ణున కిచ్చి గౌరవించెను.

---

## చతురంగము

కృష్ణదేవరాయలకుఁ జతురంగమం దపారమైన ప్రేమను. తన కించుక యవకాశముగల్గినను చతురంగమాడుటకే వినియోగించుచుండును. సాధారణముగా నీతనితో నెదురెత్తు వేయుటకు బొడ్డుచర్ల తిమ్మన్న యను నాతఁడు సిద్ధపడుచుండును. రాయలపక్షమున నెంద రాలోచించి యెత్తు వేసినను తిమ్మన యొక్కడే యెదురెత్తు వేసి నూట పదార్లు, వేయిన్నూటపదార్లు బహుమానములను గొనుచు రాయలచే మన్ననల నందుచుండును.

ఈతనిఁగూర్చి యొకానొక కవీశ్వరుఁ డిట్లు పొగడి యా తిమ్మనకుగల ప్రవీణతను వెల్లడించియున్నాడు.

క. శతసంఖ్యు లొక్కలైనను
 సతతము శ్రీకృష్ణరాయ । జగతీపతితో
 జతురంగమాడి గెల్చును
 ధృతిమంతుఁడు బొడ్డుచర్ల । తిమ్మన భళిరే.

ఉ. ధీరుఁడు బొడ్డుచర్ల చిన । తిమ్మనమంత్రి కుమారుఁ డంచితా
 కారుఁడు సత్కళావిదుఁడు । కౌశికగోత్రుఁడు పద్మనేత్రసే
 వారతబుద్ధి నందవర । వంశ్యుడు సత్కవిలోకనాథుఁ డా
 చారసమగ్రవర్తనుఁడు । చారువచస్థితినొప్పువాఁ డొగిన్.

చతురంగమున బొడ్డుచెర్ల చినతిమ్మనామాత్యునకుఁ గలనేర్పునకు సంతసించి కొప్పోలను గ్రామమునకుఁ గృష్ణరాయపురమని నామ మేర్పరచి రాయలు సర్వాగ్రహారముగా ధారవోసెను.

ఒక్కనాఁడు రాయలు తన కుమార్తెయైన తిరుమలాంబతో చతురంగ మాడుచుండెను. తండ్రి కుమార్తె లిద్దరును చతురంగమున సాధారణపాండిత్యము గలవారలు. రాయలు సభ కేగవలసిన కాల మతిక్రమించుటను గణింపక తదేకదీక్షతో నాట సాగించుచుండెను. ఆ యాటలో తిరుమలాంబయొక్క బంటుపై రాయలు రెండేనుగులను మంత్రిని పగబూనియుండునట్లు చేసెను ఆబంటును కాయుటకు తన జంతువులు కలిసిరానందున తిరుమలాంబ ఖిన్నయై యొక్కింత యాలోచించి—

"యుద్ధతుల మధ్యఁ బేదల కుండఁ దరమె" అని వచించి యాబంటును పై కెగద్రోసివైచెను. అంతట నా బంటున కొక్క నీదకాపు లభించెను. రాయ లాపద్యపాదము నాలించి "అమ్మా పద్యమంతయు నువచ్చిన జనువుమనియెను అంతఁ దిరుమలాంబ—

గీ. ఒత్తుకొని వచ్చు కటికుచో ద్వృత్తిఁజూచి
తరుణి తనుమధ్య మెచటికో తలఁగిపోయె
యుండెనేనియు గన్పడ కున్నె యహహ
యుద్ధతుల మధ్యఁ బేదల కుండఁ దరమె.

"అమ్మా యీపద్యమెక్కడిది." యని యడిగెను. అంతఁ దిరుమలాంబ "జనకా! నాలుగు దీనారముల నిచ్చి కొంటిని" రాయలాపల్కు లాలించి అమ్మా! నాకుమారీమణివైయుండియు పద్యమునకు సరియగు వెల యీయవైతివి. ఈపద్యమొక్క వేయి దీనారముల జేయును. ఆకవికి మిగిలిన దీనారముల నిచ్చివేయుము." *, అనిచెప్పి వెడలిపోయెను. తిరుమలాంబ కవికి వేయిదీనారముల నొసంగెను.

---

* ఈపద్యము సంకుసాల నృసింహకవికృతమని గురజాడ శ్రీరామమూర్తిగారి యాంధ్రకవుల చరిత్రమందును, రావుబహుద్దూర్ కందుకూరి వీరేశలింగం పంతులు గారి కవిజీవితములందును వ్రాయబడినది.

## ప్రాణము.

రాయల సభలో ప్రాణులకు ప్రియతమమైన పదార్థ మెద్దియని ప్రశ్న వచ్చెను. కొందఱు పుత్రుఁడనియు కొందఱు భార్యయనియు మఱికొందఱు మఱికొన్ని విధములుగాను బలుకఁజొచ్చిరి. రాయలు తన యభిప్రాయముతో నెవ్వరును యేకీభవింపక పోవుటచే నసంతుష్టుడయ్యెను. ఇంతలో తిమ్మరుసు రాచకార్యములగూర్చి ముచ్చటించుట కరుదెంచెను. అంత రాయ లాతనిఁజూచి "అప్పాజీ! సర్వప్రాణులకును బ్రియతమమగునదేది'' యని ప్రశ్నించెను. తిమ్మరు సించుకైన నాలోచింపక "దేవా! సర్వప్రాణులకును తమప్రాణమే ప్రియతమమైనద"ని వచించెను. తిమ్మరుసు తనతో నేకీభవించుటజూచి ''నిదర్శనము జూపగలవా" యని ప్రశ్నించెను. తిమ్మరుసు "చిత్త"మని నిష్క్రమించి వెంటనే యొకమర్కటమును దానిపిల్లను గొనివచ్చెను.

ఆవానరము నొక్కకర్రకు గట్టి దానిపై నెక్కించెను. కట్టబడియుండుటచే నటునిట్టు పరుగెత్తుటకుఁగాని నడచుటకుఁగాని వీలులేకుండెను. కర్రచుట్టును మంటపెట్టబడెను. వేడితగులుచుండ నా మర్కటము తాను సహింపగలుగు నంతపర్యంతము పిల్లను పైకెత్తి రక్షించెను గాని తానే సహింపలేనప్పుడు పిల్లను క్రిందకర్రపైనుంచి యాపిల్లపై నెక్కి నిలువబడియెను. అంత తిమ్మరుసు మంటనార్పించి పిల్లను కోతిని గాపాడి సభాసదులతో నిట్లనియెను. "తన ప్రాణము పోవునేమోయను భయమువచ్చినప్పుడు తనపిల్లను జంపియైన తన ప్రాణముల గాపాడుకొనజూచెను. ఇందువల్లనే ప్రాణులకుఁ బ్రాణముకన్న మిన్నయగు వస్తువుండ"దనియెను. రాయ లాశ్చర్యమునొంది యాతని ప్రజ్ఞకు విశేషముగా నలరి బహూకరించెను.

---

# వర్ణభేదము.

చతుర్వర్ణములవారిలో నెవ్వ రుత్తములని రాయలచే సభలో ప్రశ్నింపబడెను. ఎవరికిఁదోఁచినట్లు వా రుత్తరముఁజెప్పిరి. రాయలు ప్రత్యేకముగా తిమ్మరుసునుజూచి నీయభిప్రాయమేమని ప్రశ్నించెను. అంత దిమ్మరుసు "దేవా! మొదటి మూఁడువర్ణములవా రుత్తములు. నాలుగవజాతివారు. చెప్పనేల" యని యూరకుండెను. రాయలు నిదర్శనము చూపుమనెను. "చిత్త" మని తిమ్మరు సూరకొని సభాకార్యక్రమము నడిపెను.

సభవీడి రాయ లంతఃపురమునకుఁ బోవు సమయమున తిమ్మరు యాతనియొద్దకరిగి "దేవా! నిదర్శనము జూపుటకు రెండుమాసములు గడువీయవలయును. రేపటిదినంబున నన్ను బట్టినవారలకు విశేషముగా బహుమాన మొసంగబడునని చాటింపుఁడు" అని వినయముగా ప్రార్థింప రాయలు వల్లెయని యంతఃపురములోని కేగెను.

పిమ్మటఁ దిమ్మరుసు గృహంబున కేగి తనవారలతో తాను గ్రామాంతర మేగుచున్నట్లుదెలిపి భోజనానంతరము యర్ధరాత్రమున నొరులు తన్నుజూచిన గుర్తింపనేరనట్లు వేషమును మార్చుకొని సందుగొందులఁబడి నడచుచు నిసుమంతచప్పుడైనను వెనుదిరిగి చూచుచు విశేషముగా శ్రమనొంది యొక్క బ్రాహ్మణాగ్రహారమును జేరెను. అందొక్క విప్రునింటికేగి యాతనితో "విప్రపుంగవా! భయార్తుఁడనై నీశరణుజొచ్చితిని. నన్ను తిమ్మరుసందురు. రాయలు నన్ను జంపనుంకించుచున్నాడు. నన్నొకవారముదినములు నీయింట నుంచి కాపాడినపిమ్మట వేరొండుచోటికేగెదను. నన్ను గాపాడినందులకు నీకు సర్వదా కృతజ్ఞుఁడనై యుందును." అని దీనముగా తనువచ్చినపని నెఱిగించెను. ఆబ్రాహ్మణశ్రేష్ఠుఁడు "తమకెట్టిభయంబును లేదు. మాయింట తమయిచ్చవచ్చి

నంతకాలముండుఁడు. తమబోట్లు జీవించియుండుటవలన మాబోంట్లనేక మంది మనియుండగలరు. ఇందు మీ కెట్టిలోపమును రాదు. నిశ్చింతతో నుండు" డని యభయమిచ్చి యొక యంతర్గృహమునకుఁ దోడ్కొని పోయి వలయు నుపచారముల నొనర్ప తనకుమారుని నియమించెను.

ఆబ్రాహ్మణుఁడు తన ముఖ్యస్నేహితులతో జెప్పి వారలను గూడ సహాయముగా గైకొని యాతనిని పదిహేను రోజులవరకు కాపాడెను.

రాయలప్రకటన కఠోరముగా నుండెను. తిమ్మరుసును సజీవుని గాదెచ్చినవారికి నాల్గులక్షలదీనారములు బహుమానముగా నొసంగ బడునని ప్రకటించినతోడనే పెక్కురాతని బట్టుకొనుటకై తహతహపడు చుండిరి. కాని యాతనిపోకడ లేమియు నెవ్వరికిని గోచరించుటలేదు.

తిమ్మరుసు బ్రాహ్మణులయొద్ద 15 దినములు గడపి యొక్క వైశ్యునియొద్దకుబోయి యచ్చట తన దీనచరిత్రమును వెల్లడించి యా వైశ్యుని సహాయ మపేక్షించెను. వైశ్యుఁడు మొదట కొంచెముగా భయమందెనుగాని పిమ్మట యాతని గాపాడుట కియ్యకొని యాతనిని వేరొక 15 దినములవఱకుఁ గాపాడెను.

తిమ్మరుసు తదుపరి యొక్కక్షత్రియుని గృహమునగూడ 15 దినములు సురక్షితముగా గడపెను. ఆపిమ్మట శూద్రులను గూడ పరీక్షింపవలయునని యొక్కగ్రామమున కేగి గ్రామాధికారిగానున్న యొక్కశూద్రుని యింటికేగి యాతనితో నతిదీనముగాఁ దనచరిత్రమంతయును జెప్పి తన్ను గాపాడుమని వేడుకొనెను.

ఆతఁడును వల్లెయని యాతని నొక్కచో దాచి తనవారినెల్ల బిలిచి వారలకీతిమ్మరుసువృత్తాంత మెఱిఁగించి యిట్లనియెను. ఈతనిబట్టి రాయలకు నప్పగించినచో మనకు నాల్గులక్షల దీనారములు లభించును. ఇంత సులభముగా మనకు లభింపనున్న ధనమును వృధాగా నేలపోగొట్టు

కొనవలెను. ఈతని దోడ్కొనిపోయి వప్పగించుట కనువైనమార్గ మొకటి చూడు డనియెను. అందఱును బెద్దగానాలోచించి గుసగుసలాడు కొనిరి. ఎట్టకేల కొకడు మన మిట్లొనర్చిన మేలుగాదా యని మొదటి వాని కేదో యొకరహస్యమును జెప్పెను.

అందుల కాశూద్రుఁడును సమ్మతించి యొంటరిగా తిమ్మరుసుచెంతకుబోయి "అయ్యా! నీవిచ్చటికి రహస్యముగావచ్చినను రాయలు నకు నీరాక తెలిసినది. నిన్ను దోడ్కొనిరమ్మని నౌకరుల వెడలుమని యాజ్ఞాపించియున్నాఁడు. కాన నేడే తమ్ము వేరొక్కసురక్షితమగు ప్రదేశమునకు రహస్యముగా దోడ్కొనిపోవనిశ్చయించితిని. తమయభిప్రాయమేమి"యనెను. అంత తిమ్మరుసు భయము నభినయించుచు "నన్ను గాపాడిన నంతియేచాలును" అని చెప్పెను. భోజనము లైనపిమ్మటఁ బ్రయాణమని యాశూద్రుఁడు వెడలిపోయెను.

రాత్రి పదిగంటలకు తిమ్మరుసు నొక్క పల్లకియం దెక్కించి పైన తాళమును వేసి ప్రయాణము సాగించిరి. రాత్రి రాత్రి ప్రయాణము సాగించి యుదయమునకు విజయనగరమును జేరిరి. రాయలు సభారంగమును బ్రవేశించినంతనే యాశూద్రుఁ డాతని రాయలయొద్ద కరిగి తిమ్మరుసును దోడ్కొని వచ్చితి మని విన్నవించెను. రాయలు వెలి కరుదెంచి పల్లకీ తలుపులు దెరచి చూచెను. అందు తిమ్మరుసు సుఖముగా నిద్రించుచుండెను. రాయ లాతనిలేపి సంగతి యేమని ప్రశ్నించెను. తిమ్మరుసు "దేవా! యాలించితిరా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులయొద్ద 45 దినములు నిశ్చింతతో కాలయాపన మొనరించి మొన్నటి దినమున వీరి నాశ్రయించితిని. వీరలు నన్ను నమ్మించి తమ కప్పగించిరి. నాల్గవజాతివారి చర్యలు తమ కింతటితో నైనను తెలియవచ్చి యుండవచ్చును." అనియెను. రాయ లాశ్చర్యరసమగ్ను

డై కొంతవడి ప్రాన్పడి నిలచి పిమ్మట శూద్రులకుఁ దగినట్లు బుద్ధి చెప్పి పంపివైచెను. తిమ్మరుసును గాపాడినవారికి మంచి బహుమాన మొసంగెను.

---

## నాడుల భేదము

వేరొకప్పుడు రాయలు సభలో గూరుచుండి నాడులలోని భేదమును జూపి యెయ్యది శ్రేష్ఠమైనదో యెఱింగింపవలయునని సభికుల నడిగెను. అంత కొందఱు కొనల నాడనియు; కొందరు వెలినాడనియు, కొందఱు పలినాడనియు, మరికొందరు మఱికొన్ని దేశములనియు నెవరికి దోచినట్లు వారు చెప్పిరి. తిమ్మరుసు రాయలతో నిట్లనియెను. "దేవా! ఎన్ని నాడులైనను చిన్ననాడుతో సమానములు గావు. గృహమున నిదియున్నది యదిలేదు యను చింతలేక తల్లిదండ్రుల యాజ్ఞలేక, తల్లిదండ్రులనే శాసించుచు తన చిన్నిపొట్ట ననాయాసముగా నిండించుకొనుచు కాలయాపన మొనరించుకొనుచున్న చిన్ననాడే గదా శ్రేష్ఠతమము." అని వక్కాణించెను. ఆతని చమత్కారపు పల్కు లాలించి రాయ లాతని విశేషముగా గొనియాడెను.

---

## వసుచరిత్రమును కృతి గొననీకుండుట.

రామరాజభూషణుఁడు వసుచరిత్రమను ప్రబంధరాజమును సాంగముగా ముగించి కృష్ణరాయుని గృతిపతివి గమ్మనెను. రాయలు గ్రంథము నాలించి వచించెదనని చెప్పి యొక్కనాడు గ్రంథమును దీసికొని రమ్మనెను. రామరాజభూషణుని కోరికపై రామకృష్ణుని సభలోనికి రావలదని శాసించెను.

రామరాజభూషణుఁడు మున్నగువార లందఱును రాయల రాకకై నిరీక్షించుచుండిరి. రాయ లరుదెంచి గ్రంథమును జదువుటకు

ప్రారంభింపు మనియెను. రామకృష్ణుడు సభలో లేడుగదా యను ధైర్యముతో రామరాజభూషణు డుండెను. రామకృష్ణుం డుప్పరివాని వేషమున సభారంగమున నొక్కమూల నక్కియుండెను. రామరాజభూషణుండు జదువుటకు ప్రారంభించెను.

శా. శ్రీభూపుత్రి వివాహవేళ నిజమం । జీరాగ్రరత్నస్వలీ
లాభివ్యక్తి వరాంఘ్రిరేణుభవక । న్యాలీలయంచున్ మదిం
దా భావింప శుభక్రియాకలన చే । దద్రత్నముం గప్పు సీ
తాభామాపతి ప్రోవుతం దిరుమలేం । ద్రశ్రీమహారాయునిన్

అను పద్యమును జదువునప్పటికి యుప్పరవాని వేషమున నుండి రామకృష్ణుండు- "ఆగరో! ఆగరో! నీపుత్తకం చెత్తగానూ! ఆగరో లచ్చిపాయెరో!" యని కేకలిడుచు రాయ లెనుటి కరుదెంచెను. రాయ లిదేమని ప్రశ్నించెను. ఆయుప్పరి కొంచెము వెలిబూడిద దెప్పించి యరచేతిలో బోసికొని దానిపై శ్రీకారమును వ్రాసి నోటి దగ్గరగా బెట్టికొని భూ యనెను. ఆభూతో శ్రీ పోయెను. అయ్యది జూపి "రాజో! నీశ్రీయంత యీభూతో బోనాది చూచేవా!" యని వందలించెను. ఆపల్కు లాలించి రాయ లాపుస్తకమును కృతి గొన కుండెను.

---

## వాకటికావలి తిమ్మన

తిమ్మన యనువాతం డొక్కడు రాయల సభారంగ ద్వారమున కావలికాయు నుద్యోగమున నుండును. ఈతఁడు పండితులను కవిశేఖరులను తనశక్తికొలది గౌరవింపుచుండెను. ఆతని స్వామిభక్తికిని దాతృత్వమునకును మెచ్చి రాయ లాతని కొక్క విలువగల రత్నకంబళము నొక్కదానిని బహుమానముగా నొసంగెను.

తిమ్మన ద్వారపాలకుఁడుగా నున్న సమయమున యల్లసాని పెద్దనయు ముక్కు తిమ్మనయు, భట్టుమూర్తియు, రామకృష్ణుఁడు సభా రంగమును బ్రవేశించుచుండిరి. పెద్దనగారు తిమ్మనను జూచి

క. "వాకటికావలి తిమ్మా" యని లోనికేగెను.

అనంతరము భట్టుమూర్తి

"ప్రాకటముగ సుకవివరుల । పాలిటి సొమ్మా" యని రెండవ పాదమును బూరించి లోని కేగెను. అనంతరము తిమ్మన "నీకిదె పద్దెము గొమ్మా" అని లోని కేగెను.

అంత రామకృష్ణుఁ డాతని నఖశిఖ పర్యంతమును జూచి "నాకీ పచ్చటమె చాలు । నయముగ నిమ్మా" యని రచించి యచ్చటనే నిలచియుండెను. అంత తిమ్మనయు "తమవంటి కవిశేఖరు లడిగిన లేదందునా గొనుండ"ని యాకంబళమును సమర్పించెను. దానిని ధరించి రామకృష్ణుఁడు సభలోనికి పోయెను. రాయ లాపచ్చటమునుజూచి యిది నీకెట్లు వచ్చెనని ప్రశ్నించెను. అంత జరిగినకథ యెల్ల వివరించి యాపద్యము నిట్లు మరల జదివెను.

క. వాకటికావలి తిమ్మా
ప్రాకటముగ సుకవివరుల । పాలిటిసొమ్మా
నీకిదె పద్యము గొమ్మా
నాకీ పచ్చటమె చాలు । నయముగ నిమ్మా.

ఆకథనాలించి రాయలు తిమ్మనకు విశేషముగా బహుమాన మొసంగెను.

ఒక్కనాడు రాయలు సభలో భట్టుమూర్తి కవిత్వమునుజూచి యించుక ప్రశంసించెను. ఆపలుక్కులాలించి భట్టుమూర్తి యుప్పొంగి తనకవిత్వమునుగూర్చి తానేమెచ్చికొనుచు నాతోసమమైన కవిత్వము

జెప్పగలవాడు లేడని సూచింపులాగున బల్కెను. ఆపల్కులాలించి రామకృష్ణుడు "ఓయీ! నీకవిత్వమును నీవుమాత్రమే పొగడుకొన వచ్చును కాని—

"చీపిరి బాపిరితీగెల
చేపల బుట్టల్లి నల్లు చెప్పెడినీయీ
కాపుకవిత్వపుకూతలు
బాపనకవివరుని చెవికి ¡ ప్రమదంబిడు నే?"

అని యాక్షేపించి యాతనిగర్వ మడిపెను.

---

# అప్పయదీక్షితులు

రాయలయాస్థానమున తాతాచార్యులవారను నొకవైష్ణవ శిఖా మతంసుండు మిక్కిలిగ బూజింపబడుచుండెడివాడు. అప్పయ్యదీక్షితుల వారను స్మార్తశిఖామణి తాతాచార్యుల వాదమున నోడించి రాయల సభయం దధికసన్మానము బొందెను. ఆపరాభవమునకు చింతింపక తాతాచార్యులవారి శిష్యులు—

శ్లో॥ అప్పయ్యదీక్షితాత్పూర్వం తాతః పూజ్యోనసంశయః॥

తా. అప్పయదీక్షితులవారి పూర్వము తాతాచార్యులవారు పూజింపబడుచుండిరనుటకు సంశయములేదు. కాని వైష్ణవులు తాతా చార్యులవారిని పూజించినపిమ్మట అప్పయ్యదీక్షితులవారిని పూజించు టయను నభిప్రాయముతో నుండిరి. అంత రామకృష్ణుడు—

"ముఖప్రక్షాళనా త్పూర్వం పదప్రక్షాళనంయథా" యని పూరించెను.

"ముఖముకడుగుకొనుటకు ముందు కాళ్ళు కడిగికొనునట్లుగా" ఆపల్కు లాలించి వైష్ణవులెల్లరు నింక నట్లుపల్కరైరి.

---

92


## చీనాంబరములు.

రాయలు రెండుచీనాంబరములఁగొని తాతాచార్యులవారికిని అప్పయ్యదీక్షితులవారికిని నొసంగెను. అప్పయదీక్షితులవారా వస్త్రమును హోమము జేసిరి. మరునాఁడు తాతాచార్యులవారు రాయలతో నిట్లనిరి. "దేవా! నిన్న తమరొసంగిన దుకూల మప్పయదీక్షితుఁ డగ్నిపాలొనరించెను. చూచితిరా! అట్టివానికి వస్త్రమిాయుటయేతప్పు" ఆపల్కులాలించి రాయలు దీక్షితులవారిని బిలిపించి చీనాంబర మేమి చేసితిరనెను.

అప్పయ్యదీక్షితుఁడు "దేవా! ఆవస్త్రమును ధరింపదగినవారి కర్పింపబడెను. సందియమేమి" యనెను. "అయ్యది ధరించుట కగ్నిహోత్రునికన్న వేరుదైవములేఁడా" యని తాతాచార్యు లధిక్షేపించెను. అంతదీక్షితులు "దేవా! సందియమందవలదు. చిదంబరమునకు వార్తబంపుఁడు. శ్రీముఖమును దెప్పింపుఁడు. చిదంబరేశ్వరున కర్పింపబడె" ననియెను. రాయలు గుఱ్ఱపురౌతులను బంపి శ్రీముఖమును దెప్పించెను.

"రాజాధిరాజపరమేశ్వర మూరురాయరగండ... శ్రీకృష్ణదేవరాయలవారికి చిదంబరేశ్వరీ పూజాధురంధరుల యాశీర్వచనములు. గతదినంబున రాత్రి తొమ్మిదిఘడియలవిూద సేవజరుగుచుండ నప్పయదీక్షితులువారరుదెంచి వారి స్వహస్తమున నొకచీనాంబరమును స్వామికి సమర్పించిరి. ఎట్లువచ్చిరో యెట్లువెడలిరో తెలియదు. చీనాంబర మిందుతో బంపుచున్నాము." ఆశ్రీముఖముతో చీనాంబరముగూడ నుండెను.

రాయలయ్యది యాలించి తనజన్మసార్థకమయ్యెనని తలఁచి దీక్షితులవారి నధికముగా బూజించెను.



9

## రామకృష్ణుడు.

ఒకనాడు రామకృష్ణుఁడు సభయందు విస్తారముగా నల్లరిచేయు టచే రాయ లాతని నేమియుఁ జేయజాలక క్రోధోద్రేకమున యాతని తో నిట్లనియెను. "ఓయీ! నీవింక నాకు నీతలజూపకుండు" మనెను. ఆపల్కులాలించి వెంటనే నిష్క్రమించి యొకబుట్టను నెత్తిపై బోర్లించుకొని మరల సభలోని కేతెంచి తనస్థానమున గూరుచుండెను.

రాయలు కొన్నినిమేషములవఱ కాతని జూడనేలేదు. తొందరగా కొన్ని కాగితములపై సంతకముల జేయుచుండెను. ఇంతలో సభికు లాతనిజూచి నవ్వుచుండిరి. కొందఱు నవ్విన నేమిప్రమాదమో యని లోలోననే నవ్వుచుండిరి. మెల్లని కలకలము ప్రారంభమయ్యెను. రాయలు తలయెత్తి చూచునప్పటికి రామకృష్ణుఁడు నెత్తిపై బుట్టతో నాతని యెట్టయెదుట గాన్పించెను. అయ్యది చూచి "యిదేమి? రామకృష్ణా" యనెను. అంత రామకృష్ణుడు చేతులుజోడించి "స్వామీ! నాతల తమకు జూపవలదనిరి అందుచే నాతల బుట్టలోదాచికొంటిని. ఇందులకు వీరునవ్వుచున్నారు. దేవరయాజ్ఞ నోట వెడలకుండ నెఱవేర్చితిని. ఇందు నేజూపిన రాజభక్తికి తప్పక బహుమాన మీయవలయును." అని చెప్పెను.

ఆపల్కు లాలించి సభలోనివారెల్ల వికావిక నవ్విరి. రాయలు గూడ నవ్వు నాపుకొనలేకపోయెను. కొన్ని నిమేషములకు రామకృష్ణునితో జెప్పి యా బుట్టను దీసివేయించి యాతని బహూకరించెను.

## చిత్రలేఖనము.

రాయ లొక నూతనమందిరమున నొక గొప్ప చిత్రకారునిచే పెక్కులగు చిత్రముల వ్రాయించెను. వానిని జూచి పరీక్షించి చిత్ర

కారునకు బహుమాన మొసంగదలంచి పెద్దనాదికవిపుంగవులతో నా మందిరమున కేగెను. అందఱును చిత్రకారుని నైపుణ్యమునకు సంతసించిరి. అప్పుడు దూరముననున్న యొక చిత్రమునుజూపి రామకృష్ణుఁడు "దేవా! ఆ చిత్ర మొక్కపక్కమాత్రమే లిఖింపబడియుండెను." అని ప్రశ్నించెను. రాయలా చిత్రమునుజూచి "ఓయీ మిగిలిన భాగము కనబడుట లేకున్నను నయ్యది యున్నట్లే భావింపవలయును" అని పల్కిన యాలించి రామకృష్ణుఁడు సంతుష్టుఁడై యుండిన ట్లూరకొని యుండెను.

పిమ్మట గొన్నియేండ్లకు బొమ్మలన్నియు మాసి కళాహీనములగుటచే మరల వ్రాయింపవలయునని రాయలు తలచుచుండెను. అంతట రామకృష్ణుఁడు "దేవా! పూర్వము చిత్తరువులను జూచినప్పటి నుండియు చిత్రలేఖన మభ్యసించియుంటిని. ఇప్పటికి మంచి పాండిత్యము సంపాదించితిని. సెలవైనయెడల నేను చిత్రముల వ్రాయఁగలను." అని విన్నవింప రాయలు సమ్మతించెను

రామలింగఁడు పూర్వపుచిత్తరువుల గోకించి శుభ్రముగా వెల్లవేయించి గోడలనిండుగా నొకచో నొకముక్కును వేరొకచో నొక కన్నును యిట్లె శరీరభాగముల వేరువేరుచోట్ల వ్రాసి రాయలను జూడ రమ్మని వార్తబంపెను

రాయలా చిత్తరువులజూచి యిదేమని ప్రశ్నించెను. "దేవా! మిగిలినభాగము లావలిపక్కనున్నట్లు భావింపవలయును. ఇట్లు దేవర వారే పూర్వము సెలవిచ్చియుండిరి. అట్లనే నేను లిఖించితిని. కాన నాకు విశేషముగా బహుమాన మీయవలయును." అని రామకృష్ణుఁడు పల్క రాయ లాలించి యాతని నేమియు జేయజాలక పూర్వపు చిత్రములు పోయినవేయని మిక్కిలి విచారించెను

## పిల్లిపిల్లను బెంపనిచ్చుట.

రాయ లొక్కపరి యుద్యోగులకును, కవీశ్వరులకును, యొక్కొ క పిల్లిపిల్లనిచ్చి దానిని బెంచుట కొక్కొక పాడియావునుగూడ నిచ్చి యెవరిపిల్లి యందముగానుండునో వారికి విశేషముగా బహుమాన మొసంగుదునని చెప్పెను. అందఱును పిల్లిపిల్లను జాగ్రత్తతో బెంచు చుండిరి.

రామకృష్ణుఁడు తన కిచ్చిన పిల్లిపిల్లకు ప్రథమదినమున మఱుగు చున్న పాలను బెట్టెను. ఆ పాలంటినంతనే పిల్లి మూతికాలి బొబ్బ లెక్కెను. ఆదినమున కొంచెము గంజిపోసి మఱునాఁడు చల్లారినపాలను బెట్టెను. కాని యాపిల్లి గతదినంబున జరిగినసంగతి జ్ఞప్తియుంచుకొని పాలవాసన తగులుటతోడనే పాఱిపోయెను. అది మొదలుగ పిల్లి పిల్ల పాలవాసన తగులగనే పాఱిపోవుచుండెను. పిల్లిపిల్లను గంజినీళ్ళు పోసి పెంచుచుండెను.

కొన్నిదినముల పిదప రాయలు పిల్లిపిల్లలను దీసికొనివచ్చిన చూచి పరీక్షించి బహుమాన మొసంగుదు ననియెను. ఎల్లరును పిల్లి పిల్లలను దీసికొనివచ్చిరి. రామకృష్ణుఁడు తన పిల్లినిగూడ చంకబెట్టు కొనివచ్చెను. అందఱి పిల్లులును "మ్యా" "మ్యా"వని యరచుచుండెను. రామకృష్ణునిపిల్లి మాత్రి మఱచుటకుఁగూడ శక్తిలేక జీవనుల తోనుండెను. అంతట రామకృష్ణుఁడును "మ్యా" "మ్యా"వని యప్పు డప్పు డరచుచుండెను

రాయ లరుదెంచి నలుదెసల దృష్టి పాఱించినంతనే రామకృష్ణుఁడును యాతని పిల్లియు కంటబడెను. వెంటనే రామకృష్ణుఁడు "మ్యా మ్యా"వని కూయసాగెను. ఇదేమి నీవు కూయుచుంటివని ప్రశ్నించెను. "దేవ! ఏమని చెప్పుదును. ఈ పిల్లిపిల్ల పాలుత్రాగదు. ఆపాలను నేనే

త్రాగి బలిసియుంటిని గనుక దానిపని నే నొనర్చుచుంటిని. పాలుత్రా గవట్టి యీ పిల్లి నింతవఱకు గాపాడినందులకు నాకు తప్పక బహు మాన మీయవలయును." అని రామకృష్ణుఁడు విన్నవించెను. ఎల్లరును నిర్భ్రాంతపడిరి. రాయలును పిల్లి పాల నేలత్రాగదో చూడవలయునని పాలనుదెప్పించి దాని ముందుంచెను. పాలవాసన తగిలినతోనే యీ పిల్లిపిల్ల నడువలేక నడువలేక వెనుకకుఁ బారిపోయెను.

అంత రాయలు "రామకృష్ణా నీ పిల్లి నీవలెనే చమత్కారమైన" దని చెప్పి యాతనికి గొంతబహుమాన మిచ్చి మిగిలినవారి పిల్లలలో నుత్తమమైనదానికిఁగూడ బహుమాన మొసంగెను. అనంతరము తా జేసినపని యెల్లరకును జెప్పి వారల నవ్వు నట్లొనరించెను.

---

## లాభములో చెఱిసగము

విజయనగరమునకు కూచిపూడి భాగవతు లరుదెంచి రాయల వారి యనుమతిబొంది కోటలో భాగవతమాడుటకు నిర్ణయించుకొనిరి. ఆదినమున వేషధారులలో గొందరు పట్టణములో దిరుగుచుండ రామ కృష్ణుని ప్రభావమునువిని యాతఁడు భాగవతము జూచుటకు వచ్చిన యెడల నెట్లో విఘ్న మాపాదించునని భావించి రాయలవద్దకేగి యీ నాటికి రామకృష్ణుని రానీయవలదని ప్రార్థించిరి. రాయలు సమ్మ తించెను.

రామకృష్ణుని రానీయ వలదని గట్టిగా కట్టడిచేసి యుండుటచే రామకృష్ణుని రానియక ద్వారపాలకు లడ్డుపెట్టిరి. అంత రామకృష్ణుఁ డు మొదటిపారావానిని బ్రతిమాలి వానికి తనకువచ్చు లాభములో చెఱిసగ మిచ్చెదనని లోనికి బోయెను. రెండవపారావా డడ్డుకొన మొదటివానివలెనే వానియొద్దగూడ నట్లేచెప్పి లోనికేగి రహస్యము గా దాగియుండెను.

కృష్ణవేషగా డరుదెంచువఱకు కోకమూల డాగియుండి కృష్ణవేషగా డరుదెంచినంతనే ముందునకుఁ దోసికొనివచ్చి యాతని నోళ కవ్వముతో గట్టిగా కొట్టెను. తోడనే రామకృష్ణుఁడు వచ్చె రామకృష్ణుఁడు వచ్చెనువార్త పిలిబలినది. రాయలాతని బట్టుకొనుమని యాజ్ఞాపించి నూరుదెబ్బలు కొట్టుట కేర్పాటుచేసెను.

అంత రామకృష్ణుఁడు పారావాండ్రను బిలిపించి వారలతో తానీవఱకే కేర్పాటుచేసికొనినట్లు యిరువురకును తనలాభములో చెఱిసగమును పంచిపెట్టెను. పారావాండ్రు ధనాశవలోబడి నన్ను రానిచ్చిరి. ఇట్టి వారు నీశాత్రవులనైన నిట్లే రానిచ్చెదరుగదా యని సూచించుట కిట్లుచేసితినని రామకృష్ణుఁడు జెప్పెను. రాయలు పారావాండ్రకు బాగుగా బుద్ధిజెప్పి వారి నాపనినుండి తొలగించివైచెను.

---

## శ్రీకృష్ణదేవరాయ విరచిత గ్రంథములు.

కృష్ణదేవరాయ విరచితమైన యాముక్తమాల్యదయందలి యీ క్రిందిపద్యము వలన నాతఁడు సంస్కృతమున మదాలసచరిత్ర, సత్యావధూటీపరిణయము, అలంకార సంగ్రహము మున్నగు గ్రంథముల రచించి యున్నట్లు తోచుచున్నది.

సీ. పలికి తుత్ప్రేక్షోప । మలజాతి పెంపెక్క
రసికు కౌవన మదా । లసచరిత్రి
భావధ్వని వ్యంగ్య । సేవధి గాఁగఁ జె
ప్పితివి సత్యావధూ । ప్రీణనంబు
శృతిపురాణోపసం । హిత లేర్చికూర్చితి
సకల కథాసార । సంగ్రహంబు
శ్రోత్రఘచ్ఛటలు వి । చ్యుగ రచించితి సూక్తి
నైపుణీజ్ఞానచిం । తామణి కృతి

మఱియు రసమంజరీ ముఖ్య । మధుర కావ్య
రచన మెప్పించికొంటి గీ । ర్వాణభాష
యాంధ్రభాష యసాధ్యంబె । యందు నొక్క
కృతి వినిర్మింపు మిక మాకుఁ । బ్రియముగాఁగ.

వైశద్యమున బేర్కొనినవిగాక యింకను కొన్నిగ్రంథముల గూడ రచించియుండెనని తలంచుచున్నారు. జాంబవతీకళ్యాణ మను గ్రంథము నాంధ్రసాహిత్యపరిషత్సభవారు సంపాదించి ప్రచురింప నెంచి యున్నారు.

ప్రాచ్యలిఖితపుస్తకభాండారము వారు సంపాదించిన ప్రపంచదర్పణమను గ్రంథమున కృష్ణరాయలను గూర్చియు పెద్దనామాత్యుని గూర్చియు వ్రాయుచో నొక్కచోట నిట్లు వ్రాయబడి యున్నదని యొకరు భారతీసంపుటము లందు ప్రచురించియున్నారు.

"అల్లసాని పెద్దనార్యేణ సత్యావధూపరిణయే
అంగులీషు కురంగాక్ష్యాశ్శోభతే ముద్రికావలీ
ప్రోతేవ బాణైఃపుష్పేషో సూక్ష్మలక్ష్య పరంపరా॥
అల్లసాని పెద్దనాఖ్య నాప్యేవముక్తం రసమంజర్యామ్
ఉడురాజముఖీ మృగరాజకటి
ర్గజరాజగతిః కుచభారనతా
యదిసా రమణీ హృదయే రమతే
క్వజపః క్వతపః క్వసమాధిమతిః
కృష్ణరాయస్య అలంకార సంగ్రహే.
సిందూరంతవిమిందు మాలసముపాదమ్మల్లరోహార్గహే
ద్వగ్గాఢంగసతీ తితచ్ఛ విభుధైర్విక్రీతవా త్పాదికం
చో క్లేచంచలతా భవిష్యతిహ రాత్యాకుంతలే కర్షణం
కాం.......................హే అంగెమహోద్సంగరః॥

అని వ్రాయబడి యుండెను. పైవ్రాతలవలన సత్యావధూపరిణయము రసమంజరి పెద్దన కావ్యములని తేలుచున్నది. కాని యముక్తమాల్యదలోని పద్యమయ్యవి కృష్ణదేవరాయకృతులని తెలుపుచున్నది ఇందలి సత్యాసత్యములు చదువరులే యూహింతురుగాక.

---

## ఆముక్తమాల్యద

సీ. నీలమేఘముడాలు ! డీలుచేయగజాలు
మెఱుగుఁ జామనచాయ ! మేనితోడ
నరవిందముల కచ్చు ! నడఁగించు జిగిహెచ్చు
నాయతంబగు కన్ను ! దోయితోడఁ
బులుఁగు రాయని చట్టు ! పలవన్నె నెఱఁబట్టు
హొంబట్టు జిలుగుకె ! టంబుతోడ
నుదయార్కబింబంబు ! నొఱపు విడంబంబు
దొరలంగనాడు కౌ ! స్తుభముతోడ
దమ్మికేలుండఁ బెఱకేల ! దండమిచ్చు
లేములుడిపెడి లేజూపు ! లేమతోడఁ
దొల్కెదయదెల్పు చిఱునవ్వు ! తోడగలఁద
దాంధ్రజలజాక్షుఁ డిట్లని ! యానతిచ్చె.

ఆంధ్రనాయకస్వామి స్వప్నమున సాక్షాత్కరించి తన్ను దెలుగు నందొక్క కావ్యమును రచింపుమని ప్రబోధించియున్నట్లు చెప్పియున్నాడు. ఆముక్తమాల్యదయందు విష్ణుచిత్తుని చారిత్రము (యామునాచార్యచరిత్రము) వర్ణింపబడియున్నది. ఇందు సుమారరువది పద్యములతో రాజనీతి చక్కగా వర్ణింపబడినది. మచ్చునకై కొన్నిపద్యము లిం దుదాహరించెదను.

ఆముక్తమాల్యదనుగూర్చి రెండుమూడితిహాసముల జెప్పుచున్నారు. వాని నీక్రింద బేర్కొనుచున్నాను.

---

## 1. రాజఠివి.

రాయలు సభయందుండి మా సామంతప్రభువులెల్లరును మంచి ఠీవిగలవారుగదా యనిపొగడుకొనిరి. వెంటనే రామలింగఁడు లేచి దేవా! రాజఠీవి యెట్టిదో యెట్లలవడునో తమరే విష్ణుచిత్తీయమున నిట్లుచెప్పి యున్నారు. అట్లాచరించుటచే నేనే రాజఠీవియందతిప్రతిభగలవాడను. అని యీక్రిందిపద్యమును జదివెను.

మ. గురుగుంజెంచెలి, లేదఁగిరి సాకుందింత్రిణీ పల్లవో
త్కరముం గూడ పొరంటి నూనియలతో గట్టావికుట్టారిగో
గిరముల్మెక్కి, తమిం బసుల్పొలమువో గ్రేపుల్మెయిన్నాకమే
కెలువున్ గుంపటిమంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్.

రాయలాతని హాస్యరసప్రవీణతకు, సమయోక్తిత్వమునకు, యాతని యుక్తికి సంతసించి నన్నే యింతగా నాక్షేపించితి వింక నితరుల నూరకుందువా యనెను.

---

## 2. విమర్శనము.

రాయలు కవీశ్వరులజూచి నాయాముక్తమాల్యదను జదివి చక్కగా విమర్శించి గుణదోషముల నిరూపింపుడని ప్రశ్నించెను. అంత రామకృష్ణుఁడు "దేవా! దేవరరచించిన గ్రంథమునకు విమర్శనమేల? ఏగుడ్డును లేదు భోజనమొనరించి హమ్మని నట్లున్నదనెను. ఆపల్కులకు నగి గుణాగుణముల జెప్పక యిట్లసందర్భము లాడెదవేల ననియెను. అంత రామకృష్ణుఁడు దేవా! అసందర్భపుమాటల పోలికచూపుటకే గాబోలు

తమరు విష్ణుచిత్తీయమున యీక్రిందిపద్యమును రచించి యున్నారు చూడుడని యీక్రిందిపద్యమును జదివెను.

శా. ఆనిష్ఠానిధిగేహసీమ నడురే । యాలించినక్ మోవియున్నం
తేనాగేంద్రశయానుపుణ్యకథలుక్ । దివ్యప్రబంధానుసం
ధానధ్వానము; నాస్తిశాకబహుతా । నాస్త్యుష్ణతానాస్త్యపూ
పో; నాస్త్యోదనసౌష్టవంచకృపయా । భోక్తవ్యమన్నల్కుర్క.

దేవా! ఏమియు లేదు భోజనము చేసి పొమ్మనుట యిందు లేదా! నావి యసందర్భపు వాక్యములా?" అని చెప్పిన విని రాయలు రామకృష్ణునకు బహుమానమొసంగి గౌరవించెను.

---

## నల్లకుక్కను తెల్లకుక్కనుగా జేయుట.

ఒక్కనాడు రాయలు క్షురకర్మ చేయించుకొనదలంచి మంగలివానికి వర్తమానము బంపి వాడు వచ్చునంతలో లేవ వచ్చునని యెంచి బద్ధకముగా నుండుటచే నొక పడకకుర్చీయందు బరుండి నిద్రించెను. క్షురకుఁ డరుదెంచు టాలస్యమయ్యెను. ఇంతలో శ్రీకృష్ణదేవరాయలు గాఢనిద్దుర జెందెను.

క్షురకుఁ డరుదెంచి చూచునప్పటికి రాయలు గాఢనిద్దురలో నుండెను. రాయలకు నిద్రాభంగమొనర్చిన కోపించునేమోయని రాయలను ప్రబోధింపక రాయలకు నిద్రాభంగము కాకుండునట్లు నేర్పుమై క్షురకర్మ గావించి వెడలిపోయెను.

రాయలు మేలుకాంచి సమీపమున నున్న దర్పణములో దన ప్రతిబింబ మీక్షించెను. తోడనే క్షురకుఁ డరుదెంచి క్షౌరముం జేసి యరిగెనని తెలిసికొని తానిద్రించుచుండగా నంత మెలకువతో నేర్పుతో క్షురకర్మ నాచరించిన యా మంగలివాని బిలిపించి "ఓరీ! నీపనితనమునకు మెచ్చుకొంటిమి. నీకు కావలసిన కోర్కెఁ గోరుకొమ్ము"

అనెను. ఆమంగలివాఁడందులకు సంతసించి దేవా! నన్ను బ్రాహ్మణు లలో గలుపు డింతయె నాకోర్కెయని విన్నవించెను. రాయలు పురోహితుని బిలిపించి యీ మంగలవానిని బ్రాహ్మణులతో గలుపవలయు ను వలయుయత్నములఁ జేయుమనెను. పురోహితుఁడును చేయునదిలేక యామంగలవానిని తుంగభద్రానదికిం గొనిపోయి యందు వానిచే స్నానము చేయించుచు వేదమంత్రములు పెక్కిటిని జదువుచు పలువిధ ముల శ్రమపడుచుండెను. ఈవర్తమానమును రామకృష్ణుఁ డాలించి యొక నల్లకుక్కను బట్టుకొని యొకత్రాటను దానికి గట్టి యామంగలి వానిని స్నానముచేయించినపుడెల్ల కుక్కను స్నానము చేయించు చుండెను

రాయలు తుంగభద్రానదీతీరమున మంగలివానికి బ్రాహ్మణత్వ ములభించెనో లేదో స్వయముగా చూడఁగోరి యచ్చటికరుదెంచెను రామ కృష్ణుఁడు నీళ్ళలో ముంచి పైకీడ్చుచున్న బాధసహింపలేకకుక్క మొఱుగ సాగెను. రాయ లదిచూచి రామకృష్ణా! ఆకుక్క నేల బాధించెదవని ప్ర శ్నించెను. రామకృష్ణుఁడు దేవా! ఈనల్లకుక్క నెట్లైనను తెల్లకుక్కను జేయ యత్నించుచుంటిని గాని దీనిరూపమించుకంతయు మారలేదు. అ యినను యియ్యది తెల్లకుక్క గాఁగలదను నమ్మకము గలదనెను. అంత రాయలు నవ్వి, ఎంతవెఱ్ఱివాడవు, నల్లకుక్క యెన్నటికైన తెల్లకుక్క యగునా యని ప్రశ్నించెను. అంత రామకృష్ణుఁడు దేవా! మంగలి బ్రాహ్మణుఁడగుచుండ నల్లకుక్కమాత్ర మెందులకు తెల్లకుక్క కా జాలదని మరల ప్రశ్నించెను. రాయలు తనయవివేకమునకు సిగ్గుపడి మంగలి యెట్లును బ్రాహ్మణుఁడు కాజాలడని తెలిసికొని వాని బిలిపించి ఓరీ! యీస్నానాదులవలన బ్రాహ్మణుఁడవుగాజాలవు వేరొండు కోరు కొమ్మనిచెప్పి వానికి విశేషముగుధన మొసంగి పంపివేసెను. పిమ్మట యచ్చోటగల వారితో గలసి గృహంబునకేగెను.



## *కృష్ణదేవరాయునికిఁ గల్గినశాపము

ఆనెగొందెకైఫీయతులో నీక్రిందివృత్తాంతము లున్నవి.

కృష్ణరాయలు నర్మదానదికి దక్షిణమందుండు దేశము జయించెను. ఆతనికి లక్ష సేన లుండెను. కృష్ణరాయుని గజసైన్యబలమంతయు నొక్కసామంతునియధీనములోనుండెను. ఆసామంతునియొక్కపరి నానెగొందెవిడిచి మఱియొకచోటికి బోవ శ్రీకృష్ణదేవరాయ లాజ్ఞాపించెను. ఆవృత్తాంతమాద్యంతము వినిన యిరువురుగోసాయిలు కృష్ణరాయునితో నాసామంతప్రభుని దేశాంతరమునకు బంపవలదని పెక్కువిధముల వేడుకొనిరికాని కృష్ణరాయలు దయజూపక యాగోసాయీలవాక్యములపై లక్ష్యముంపక యాసామంతుఁడు దేశాంతరమునకుఁ దప్పక పోవలయునని తీర్మానించెను. గోసాయీలు రాయలకుఁ గొన్నినీతు లుపదేశించి సామంతు నెట్లైనను యానెగొందెలోననే నిలుపుమని ప్రార్థించిరి. రాయలు వారిమాటల నాలింపక వారల వెడలిపొమ్మని కసరికొనెను. అప్పు డాగోసాయీలు కోపమున కృష్ణరాయునిఁజూచి నీవు మాపల్కులపాటింపకుంటివి గాన సంతానహీనుఁడవుగమ్ము. నీయనంతరము నీసింహాసనమెక్కుటకు న్యాయమగు వారసుడు లేకుండుగాక యని వెడలిపోయిరి.

## అముక్తమాల్యదలోని పద్యములు

సీ. పీడెంపు బలుకెంపు । విరిసి వెన్నెలగాయ
వరిగింజ నొకట బ । ల్వరుసఁ దోమ
నెరసి మెత్తినమణుం । గొందక మేన ని
గ్గులుదేఱఁ బనపాడి । జలకమాడ

* గురజాడ శ్రీరామమూర్తిగారి కవిజీవితమునుండి నియ్యది గైకొనబడినది.

ముదుక గాకుండఁ బ । య్యెదలోన గేలార్చి
కలయ నొంటను జంట । గలప మలది
రతిరయచ్ఛిన్నసూ । త్రమునఁ జిక్కక ముత్తె
ములు రాల గఱగటి । కలు వహింప
నొఱసినను నెట్టినరునైనఁ । గులముదెలియఁ
బ్రభుతనెడి పల్లవుఁడు పేద । వడిననేద
నృపతి వెలియంతిపురముగా । నెన్న మెలఁగ
బాసఁ గృతిఁజెప్పవలఁతు । లపద్మముఖులు.

ఉ. వేవిసమేడపై వలభి । వేణికజంటవహించి విప్పఁగా
బూవులుగోటమీటుతటి । బోయెడు తేఁటుల మ్రోతకామిశం
కావహమౌ గృతాభ్యసన । మాటను దంతపుమెట్ల వెంబడిన్
జేవడి వీణమీటుటలు । జిక్కొడలించుటలు న్సరింబడన్.

కం. ఆళివచఃకార్పణ్యం
బాలేమల చెవులుసోక । దథమాన్వయ జీ
ర్ణాలావణ్యులపిలుపున
కై లాథము దెలిపెనేని । యవి శ్రీలగుటన్.

---

## జాంబవతీపరిణయము.
### సంస్కృత నాటకము.

శ్లో॥ వాసిష్టం సతతంజేయాత్త ద్వారణముఖమ్మహః
యచ్ఛుణ్డ్రిమాలే రానన్దనిష్యందం ప్రథమంవిదుః॥

శ్లో॥ సాఖ్యం సమగ్రయతువః సజగన్నివాసః
యస్యోరసిస్ఫురతి కౌస్తుభరత్నహారః
గాఢోపగూఢకమలాహృదయానురాగ
నిష్యంద బిందురివ నిశ్చలసన్నివేశః॥

శ్లో॥ అకూతస్మితగర్భమర్ధవచసానీ వేదిశంశ్శన్ధితో
తుక్శిణ్యావద నేరుషా సకుటిలభ్రూవిల్య నేల్యనే
సై పాతాన్వితవేతి రోకులతి కాంపాస్తాంచలేన స్పృశ౯
అవిస్సాద్వ సయానయాన రభసాశ్లిష్టో హరిః పాతువః॥
శ్లో॥ లలితతయామృదులతయా రాగాతిశ యేన నైవ భేదకథా
నఖరుచి రేవభిభేతీ హస్తాశోక ప్రవాళచోరంస్య॥
శ్లో॥ కల్పానోకహపుష్పధూళిపలులైః కృత్వాలవాలస్థితిం
పుండ్రేక్షుపకైర్వ్యతిన్నదసుదాదారాభిరాసేచనమ్
మాధుర్యంతరుమారచయ్యమదనక్రీడావనేవర్ధితా
సిక్తాసూక్తిరియంవిపాకవిస్పృతైః కింతత్ఫలానాంరసైః॥
నిసర్గమలినాద్ధ్వనాద్భవతివిద్యుదుద్యోతనీ
స్వభావకఠినాద్గిరేః కుసుమితాజలాజాయతే
తిశంగణభీమణాదభవదమ్బుధేరిన్దిరా
తరోర్విటవసంకటాత్తరుణమంజరీజృంభతే॥
ధర్మః పాదచతుష్టయేనకృతవత్ స్థైర్యంసమాలంబతాం
చాతుర్వర్ణముపైతుకర్మసతతం సన్స్వాధికారోచితం
శేషత్మాధరనాయకస్యకృతయాసప్తార్ణవీమధ్యగాం
రక్షన్గామిహాకృష్ణరాయనృపతిఃజీయాత్సహస్రంసమాః॥

---

## ఆముక్తమాల్యదలోని రాజనీతి.

ఇందలి నాల్గవయాశ్వాసములోని 205 వ పద్యాను మొదలుకొని యాశ్వాసాంతమువఱకును రాజనీతి చెప్పబడియుండెను. ఇంచుమించుగా 85 పద్యములలో జెప్పబడిన రాజనీతిని సులభమగు తేటతెలుగుమాటలల కొందరు చెప్పియున్నారు. అందలిపద్యములలో రెంటి నిందిచ్చుచున్నాను.

సీ. దండపారుష్యంబు । కొండెంబునను తర్క
మరిసంధి కెడయీక । మరలఁబడుట
యవలితప్పెన్నిక । న్నవిదేశ్యుఁ జెఱచుట
ప్రతిపత్తి కర్తకున కేర్పడఁగఁ జేత
జనులవిశ్వాసంబు । గనుగొని మెలఁగుట
విశ్వసనీయుల । వేర్పఱచుట
మోమోటమంత్రంబు । బోమిక్కిలిడుకొంట
మంత్రిభేత్తకునాజ్ఞ । మరచియుంట
వింతపుట్టినఁ గనుగల్గి । చింత సేయ
కుంట మాన్యులపట్టున । నొక్కచూపె
చూడకుంట విహీనుల । గూడుకొంట
వ్యసనినై యుంట చలకుంట । వలదు పతికి.

## తిమ్మరుసు.

కృష్ణదేవరాయలు తాను జీవించియుండగాఁ దన కుమారుఁడు రాజ్యము చేయుట జూడవలెనను యభిలాషతో నారేండ్ల వయసువాడైన తనకుమారునకు పట్టముగట్టి తాను మంత్రియై తిమ్మరుసును కార్యనిర్వాహకునిగా నిల్పెను. సుమారు పదిమాసములు సామ్రాజ్యమునందంతటను గొప్పయుత్సవములు జరుపబడెను.

కొన్నిదినములపిదప నొకయాకస్మిక జాడ్యముచే నాబాలరాజు మరణించెను. అందుపై రాయలు తిమ్మరుసు కుమారుడు విషమిచ్చి తనకుమారుని జంపినాడని యనుమానపడియెను. ఆయనుమానమే పెనుభూతమయ్యెను. తనయనుమానమే నిజమని తలఁచి తిమ్మరుసును కుమారుని తమ్ముని కుటుంబమును జెఱలోనుంచెను.

చెఱలోనున్న తిమ్మరుసు కుమారుఁడు చెఱసాలనుండి తప్పించుకొని రాయలపై దండయాత్ర నడిపెను. ఆయుద్ధములో తిమ్మరుసు కుమారుడగు గోవిందరాజు రాయలచే జిక్కెను. రాయలు వాని కన్నులను దీయించి చెఱలో నుంచెను. గోవిందరాజట్లనే మూడువత్సరములుండి మరణించెను.

ఇట్లు కథయున్నది చరిత్రకారులు గూడ వ్రాసియుండిరిగాని యట్లు తిమ్మరుసుగాని తిమ్మరుసుసంతతివారు గాని చేయుటకు గల కారణములు దొరకలేదు.

---

## శ్రీకృష్ణదేవరాయల నిర్యాణము.

తిమ్మరుసు కుమారుఁడగు గోవిందరాజుతో యుద్ధమొనరించిన పిదప కొలదికాలంబునకు రాయలు తురకలపై దండెత్తి వారిని జయించి మరల విజయనగరమున కరుదెంచి వ్యాధిపీడితుఁడాయెను.

తుళువవంశీయులగు తండ్రి సోదరుఁడు యేజాడ్యమున నంతమొందిరో యాజాడ్యమున నీతఁడుగూడ నిర్యాణ మొందినాడని యభిప్రాయపడుచున్నారు నిర్యాణకాలమును సరిగా దెలుపు యాధారములులేవు. అయినను యీక్రిందిపద్య మొక్కంత యీవిషయమున సహాయకారిగా నున్నది.

ఉ. బోపన యాచకప్రతతి । భూరివిపద్దశ నందుచుండఁగా
నారయ శాలివాహనశ । కాబ్దము లద్రియుగాబ్ధిసోమలం
దారణవత్సరంబున ని । దాఘదినంబున మాఘశుద్ధప
క్షిరవివాసరంబున నృ । సింహుని కృష్ణుఁడు చేరె స్వర్గమున్
ద్వారకనున్నకృష్ణుఁ డవ । తారసమాప్తిని జెందుకైవడిన్.

---

## కొన్ని పద్యములు.

మ. బలభిన్నాగము చెంపఁగొట్టి గిరిజా । ప్రాణేశు నట్టెక్కి వా
గ్గలజా తేక్షణకొప్పువట్టి శశి । కుంబెక్కి ఘట్టించి యా
బలరామున్ మొలబట్టి నీయశము భూ । భాగమ్మునన్ మించె నా
లలనామన్మథ! కృష్ణరాయనరపాలా! రాజకంఠీరవా. 1

క॥ నరసింహాకృష్ణ రాయుని
కరమరుదగుకీర్తి యొప్పె । కరిభిద్గిరిభి
త్కరికరిభి ద్గిరిగిరిభి
త్కరిభి ద్గిరిభి త్తురంగక । మనీయంబై. 2

ఉ. అబ్జముఖీమనోజ నర । సాధిపనందన చూడ నీయశం
బబ్జకరాబ్జజాబ్జనయ । నాబ్జవిలాసము నీవితీర్ణియుం
బబ్జకరాబ్జజాబ్జనయ । నాబ్జవిలాసము నీపరాక్రమం
బబ్జకరాబ్జజాబ్జనయ । నాబ్జవిలాసము చిత్రమిద్ధరన్. 3

చం. పెనిమిటిచేయు పుణ్యజన । పీడనవృత్తియుఁ దండ్రిభంగముం
దనయు ననంగభావమును । దమ్ముని కార్శ్యము జూచి రోసి స
జ్జనపరిరక్షు శౌర్యనిధి । బాహుశరీరుఁ గళాప్రపూర్ణు న
వ్వననిధికన్య చేరె జిత । వైరినికాయుని కృష్ణరాయనిన్. 4

గీ. పద్మనాట్యస్థలంబునఁ । బక్కిలోన
బైరుపైఁ బవ్వళించిన । పరమమూర్తి
అనుదినంబును కృష్ణరా । యాధిపునకు
జుక్క జగడాలవేలుపు । శుభము లొసగు. 5

ఉ. కాయమువంగి తాముదిసె । గన్నులునుం బొరగప్పెఁ గాలుపే
దా మెనటంచు రోసి నర । సాధిపనందన । కృష్ణరాయ యీ

భూయువతీలలామ నిను । బొందిన వాదిభుజంగభర్తకుఁ
బాయనిచింతచేత తల । ప్రాణముతోఁకకు రాకయుండునే. 6

శా. శ్రీలీలాత్మజ కృష్ణరాయ సమరో । ర్విన్ నీను వైరిక్షమా
పాలుర్వీగి హయాధిరూఢులగుచుం । బాఱన్ వనీశాఖిశా
ఖాలగ్నాయతకేశపాశులయి యా । గన్ గేకిసల్గొట్టి యు
య్యాలో జొంపలొయంచు బాడుదురుభి । ల్లాంభోజపత్రేక్షణల్.

ఉ. ఏపున కృష్ణరాయజగ । తీశ్వరుఖడ్గము మింటిమార్గముం
జూపిన భానుమండలము । సొచ్చి హుటాహుటి శత్రులేగుచో
రేపటి బాపనయ్య పగ । లింటి మహాగ్రిపు జంగమయ్య! మో
మాపటి దాసరయ్య మమ్ము । మన్ననసేయు మటందు రెంతయున్. 8

ఉ. కాసియు నీకరాసి సరి । గాదు నృసింహుని కృష్ణరాయ! యా
కాసిని జచ్చువారికిని । గల్గును జేతికిఁ బుఱ్ఱె నీమహా
గ్రాసిని గండతుండెములు । గామృతిఁబొందిన వైరికోటికిన్
భాసురరంభకుంభకుచ । భారము లబ్బెను నేమిచిత్రమో. 9

శా. రాయగ్రామణి కృష్ణరాయ భవదు । గ్రక్రూరఖడ్గాహిచేఁ
గాయం బూడ్చి కళింగదేశనృపతుల్ । కానిర్ఝరీపోషణీ
మాగూభీకుముటూరులోటుకుహుటూ । మాయాసటాజాహారే
మాయాగ్గేయమదే యటందుర్రి దివిరం । భాజానునిన్ యత్నునిన్.

మ. సమరక్షోణిని కృష్ణరాయలభుజా । శాతాసిచేఁబడ్డ దు
ర్దమదోర్దండపుళిందకోటి యవన । వ్రాతంబు సప్తాశ్వమా
ర్గమునన్ గాంచి సెబాసహో హరిహరం । గాఖూబు ఘోడాకి తే
తుముకీబాయిల బాయిదే మలికియుం । మర్నింటికిం బోవుచున్. 11

మ. గవకుల్ బల్లిదమయ్యె ఢిల్లికినిమ । క్కా-కోట మేలయ్యెఁ బం
దువకుం గ్రొత్తగఁ గ్రొత్తడంబు లమరెన్ । బోలేరు బిందేరులన్

దవసంబెక్క బెడందకోటపుర కాం । తాగర్భనిర్భేదన
ప్రవణంబైన భవత్ప్రయాణ జయవా । ర్తన్ గృష్ణరాయాధిపా.

మ. నరసాధీశ్వరు కృష్ణరాయ జగతీ । నాథాభవత్కీర్తికిన్
సురకల్లోలినివీగి భర్గుఁడుజటా । జూటంబు ప్రాప్తించెనా
హరుఁ డవ్వాహిని వార్ధిముంచుట భయ । స్వాంతాంగుఁడై పూనెనా
కరిచర్మంబు కపాలమున్ భసితమున్ । ఖట్వాంగమున్ శూలమున్.

మ. ..........రితిదేమికృష్ణతతి దేవా కృష్ణరాయక్షమా
తలనాథుం డనివారితాన్నమిడగా దద్బ్రాహ్మణ పోశనం
బులకుం బోయె సముద్రజీవన మింకం బూరించు నారాజు ని
ర్మలితాన్నోదక దానధారల విచారం బేల ప్రాణేశ్వరీ. 14

సీ. చెడిపి రాలొత్తిన । యడుగుఁ దమ్ములకును
గట్టుబయ్యెదఁజించి । చుట్టుకొనుచు
బయలైన కుచకుంభ । పాళులకును జంటి
శిశువుల మాటుగాఁ । జేర్చుకొనుచుఁ
గసుగందులకు వడ । గాలికిఁ జాటుగాఁ
గచభరంబులు విప్పి । కప్పుకొనుచు
వీడిన తురుము నీ । వియదాక సడలించి
చేలాంతము ముసుంగు । చేర్చుకొనుచు
ఖాన మల్కవజీరుల । మానవతుల
పాట పరువున నీవు క । ల్బరిగగొనిన
బ్రమసి దెసచెడి నలుగడఁ । బఱతురౌర
ఆహా వో పేంద్ర! కృష్ణరా । యక్షితీంద్ర. 15

సీ. అమితప్రతాపబా । లార్క విస్ఫూర్తిచే
నదన గోల్పడియె న । య్యుదయశిఖరి

భేరీధణంధణా । ఘోరవాదములచే
విను కొండ దుర్గంబు । విఱిగిపడియె
వాహినీసవుతాబు । వాహాముఖంబురా
లక్కయై కరగె । బెల్లంబుకొండ
కూర్చిరరావులతఖడ్గ । కులిశ ధారలచేతఁ
గొలసి బెట్టువిరగొట్టెఁ । గొండవీడు
కూలె బెజవాడ కంపించెఁ । గొండపల్లి
పగిలెఁ గటకంబు గగ్గోలు । పడియె ఢిల్లి
ఏకధాటిగ నీవు దం । డెత్తినపుడు
కీర్తిత్రోపాయధౌరేయ । కృష్ణరాయ. 16

శ్లో॥ వీరాగ్రేసర! కృష్ణరాయనృపతే! త్వద్వైరికాంతావనే
ధావంత్యః కుచయానరోమలతికా వ్యాహార లీలాభృతః
ప్రాప్తాన్ కోక మహేభపన్నగశుకాన్ రుంధంతి వక్త్రేందునా
మధ్యేనాపిక చేనకంకణాలస ద్వైధూర్య్యరత్నైరపి॥

శ్లో॥ భోభోభూవర! భూరివిక్రమ! భవద్ధాటీషు విద్యాధరై
ర్నిస్సాణేషు ధణంధణం ధణధణంధుణంధణధ్యానిషు
త్వత్కృత్తప్రతిమల్లవీర వరణే దేవాంగనానాముభూ
న్నృత్తే భ్యోధిమిధిమ్మి ధింధిమిధిమింధింధింధిమిధింకృతిః॥

శ్లో॥ దృగ్భిత్యా నరసతుమాపతి నభస్స్త్రీణాంమృగేణాశ్రితో
రాజాతన్ముఖ తర్జితస్స్వయమపిత్యక్త్వాఽత్మనో మండలమ్
దుర్గేశస్యజటాటవీముపగతః ప్రాణౌతమేణాంధథా
సన్మార్గ ప్రవిణోని జాశ్రితతమం తీణోఽపినోపేక్షతే॥

శ్లో! వీరాగ్రేసర! కృష్ణరాయ! భవతాక్కృత్తారణ ప్రాంగణే
ప్రోద్ధాః కేచన పారసీకపతయః ప్రాప్తాః పురీ మామరీమ్

వీరుత్తే తిగురావల ద్విషిసుంత్తాణేతి శచ్యాంపున
ర్భిచ్ఛీతి, ప్రిణతౌ సలామితి సురాణ్ స్మేరాననార్ కుర్వతే॥

శ్లో॥ కృష్ణరాయ! స్తువంత త్వాంకవయోనవయంస్తుమః
నరసింహకిశోరస్య క్రియార్ గజపతేర్జయః॥

శ్లో॥ శ్రీకృష్ణ క్షితిపాలదత్తమణిభిర్విద్వత్కవీనాంగృహా
నానారత్నవిచిత్రకుట్టిమభువోరత్నాకరత్వంగతాః
అబ్ధిః కేవల వారిపూర నిలయస్సంభావతే సజ్జనై
రంభోదిర్జలనిధిఃపయోధిరుదధి ర్వారానిధిర్వారిధిః॥

---

## శాసనములు.

1. శాసనము శాలివాహన సం॥ ౧౪౩౭ యువ సం॥ ధరణికోట.

స్వస్తిశ్రీమన్మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరురాయరగండ, అరిరాయవిభాళ, భాషిగె తప్పువరాయరగండ, అష్టదిక్కుల రాయ మనోభయంకర, పూర్వదక్షిణ పశ్చిమసముద్రాధీశ్వర, యవనరాజ్య సంస్థాపనాచార్య, గజపతివిభాళ, శ్రీవీరప్రతాప, కృష్ణదేవ మహారాయలు విజయనగరాన నుండి పూర్వదిగ్విజయ యాత్రకు వేంచేసి, ఉదయగిరి దుర్గము సాధించి తిరుమల ప్రేతరాయ మహాపాత్రుని పట్టుకొని, అద్దంకి, వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునకొండ, తంగేడు, కేతవరము మొదలైన గిరిదుర్గస్థల దుర్గాలు అన్నియేకథాటిం గైకొని కొండవీటి దుర్గము ఎగ్గలుపుచ్చుకొని ప్రతాపరుద్ర గజపతి కుమారుఁడు వీరభద్ర రాయునిన్ని కుమార హంవీర మహాపాత్రుని కొడుకు వీరమహాపాత్రుఁడు, రాచూరి మల్లాఖానుఁడు, ఉద్దండఖానుఁడు, పూసపాటి రాచిరాజు, శ్రీనాథరాజు, లక్ష్మీపతిరాజు, జన్న్యామల కసవాపాత్రుఁడు మొదలుగాను పాత్రసామంతులను, మన్నవారిని, జీవగ్రాహముగాను పట్టుకొని వారికి అభయదాన

మిచ్చి ధరణికోటకు అమరేశ్వరులకై వేంచేసి స్వస్తిశ్రీ విజయాభ్యు దయ శాలివాహన శకవర్షంబులు ౧౮౩౭ అగు నేటి యువసంవత్సర ఆషాఢబహుళ ౧౨ భానువారమున కృష్ణవేణీ నదీతీరమందు అమరే శ్వర దేవుల సన్నిధిని తులాపురుష మహాదానము సేయ నవధరించి తమదేవులు చిన్నాదేవమ్మచేతను రత్నధేను మహాదానమున్ను తిరు మల దేవమ్మగారిచేతను సప్తసాగర మహాదానమున్ను చేయించ నవ ధరించి తమతండ్రి నరసారాయణిం గారికిన్ని తమతల్లి నాగాదేవమ్మకు న్ను పుణ్యముగానూ అమరేశ్వరదేవుని నైవేద్యమహాపూజలకు ధా రాపూర్వకముగాను సమర్పించిన పెదమద్దూరు గ్రామమొకటి చతు ర్వేద విద్యాపారగులైన బ్రాహ్మణులకు నూటయెనమండ్రకు గ్రామ ములు—౮.

౧ అద్దంకిసీమలో నిచ్చిన నిడమూరుగ్రామము.
౧ అమ్మనబ్రోలు సీమలో వల్లూరుగ్రామము.
౨ వెరసి.

తమపురోహితులు సర్వక్రతు సర్వతోముఖ వాజపేయాజు లైన రంగనాథ దీక్షితులకున్ను శివాదీక్షితులకున్ను

౧ అమ్మనబ్రోలు సీమలో ధారాపూర్వకముగా నిచ్చిన కొత్తపల్లి
౧ తోవగుంట
౨

ఈ ధర్మాలు ఆచంద్రార్కముగాను ఎవరు తప్పక నడుపుతారో ఆపుణ్యపురుషుల యొక్క పాదాలు మాశిరస్సున ధరించేము. ఈధర్మ ములకు ఎవరు హాని తలచినా- నడుపని పాతకులు తమతల్లి దండ్రిలను బ్రాహ్మణులను కపిలధేనువులను కాశిలో గంగాతీరమందు చంపిన పాపాన్ని పొగలరు.

శ్లో॥ స్వదత్తా ద్విగుణంపుణ్యం పరదత్తానుపాలనం
పరదత్తాపహారేణా స్వదత్తం నిష్ఫలంభవేత్॥
శ్లో॥ ఏకైవభగినీలోకే సర్వేషామపి భూభుజామ్
నభోగ్యానకరగ్రాహ్యా విప్రదత్తావసుంధరా॥
శ్లో॥ సామాన్యోఽయంధర్మ సేతుర్నృపాణాం
కాలేకాలేపాలనీయో భవద్భిః
సర్వానేతాన్ భావినః పార్థివేంద్రాన్
భూయోభూయోయాచతే రామచంద్రః॥



నెం 2. శాసనము. ౧౪౩౮ సం॥ (ధాత) సింహాచలము. శ్రీమన్మహారాజాధిరాజ........కృష్ణదేవరాయలు విజయనగరము సింహాసనారూఢుఁడై పూర్వదిగ్విజయ యాత్రకువిచ్చేసి యుదయగిరి కొండవీడు కొండపల్లి రాజమహేంద్రవరము మొదలైన దుర్గాలు సాధించిరి. సింహాద్రికి విచ్చేసి స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శా. శ. ౧౪౩౮ అగు నేటి ధాత సంవత్సర చైత్రబహుళ ౧౨ ద్వాదశి వారాన సింహాద్రి నాథుని దర్శించి తమతల్లి నాగాదేవమ్మగారికిన్ని తమతండ్రి నరసారాయణిం గారికిన్ని పుణ్యమునకు గాను దేవునకు సమర్పించిన కంఠమాల 1 కి ముత్యాలు ౬౧, వజ్రమాణిక్యాల కడియాలజోడు ౧ కి శంఖచక్రాలపతకము ౧, పైడిపళ్ళెము ౧ కి తూకాలు ౪౪౨౭౨ కానికి మాడలు ౨౦౦౦ తమరాణీలు తిరుమల దేవమ్మగారిచేతను పతకము ౧కి వరహాలు ౫౦౦ తమచిన్నా దేవమ్మగారిచేత సమర్పించిన పతకము ౧కి గా ౫౦౦ యింతమట్టు సమర్పించిన ధర్మశాసనం.



నెం 3 శాసనము 1438 (౧౪౩౮) శా. శ. ధాత సం॥

స్వస్తిశ్రీ మన్మహారాజాధిరాజ........శ్రీ వీరప్రతాపకృష్ణదేవరాయలు పూర్వదిగ్విజయ యాత్రకువిచ్చేసి యుదయగిరి దుర్గము

సాధించి తిరుమల పేత్రరాయమహాపాత్రుని పట్టుకొని వినుకొండ బెల్లముకొండ నాగార్జునకొండ అద్దంకి, అన్నమబోలు, తంగేడు, కేతవరము మొదలయిన గిరి దుర్గాలు యేకధాటిని గైకొని కొండవీటికి విచ్చేసి దుర్గంచుట్టువారుకుని నడచప్పరాలు పెట్టి కోట పడదోయించి నాల్గుదిక్కులాను లగ్గలు విడిపించి దుర్గంతీసుకొని దుర్గంమీదనున్న ప్రతాపరుద్రగజపతి మహారాజుకుమారుఁడు వీరభద్రరాయుఁడు, కుమారహంవీరపాత్రుని కొడుకు నరహరిదేవు, శ్రీనాధరాజు, రామరాజు కొడుకు లక్ష్మీపతిరాజు రాచూరియలువఖానుఁడు, ఉద్దండఖానుఁడు జన్యామలకసవాపాత్రుఁడు, వీరు మొదలైన పాత్రసామంతులనున్ను మన్నవారిని జీవగ్రాహముగా పట్టుకొని వారికి యభయదానమున్ను యిచ్చి ధరణికోటకు విచ్చేసి అమరేశ్వరుని మహాదేవుని తులాపురుష మహాదానమున్ను చేయనవధరించి తిరిగి విజయనగరానకు విచ్చేసి రత్నసింహాసనస్థుఁడై సామ్రాజ్యము చేయుచున్న మఱి కళింగదేశదిగ్విజయార్థమై విచ్చేయుచు అహోబలానకు వేంచేసి దేవునిదర్శించి శ్రీవిజయాభ్యుదయ శా. సం॥ ౧౪౩౮ అగు నేటి యువసంవత్సర పుష్యశుద్ధ ౧౫ (15) శుక్రవారమందు శ్రీ అహోబలదేవునికి కంఠమాల ౧ పచ్చలు చెక్కిన వజ్రాల మాణిక్యాల కడియాలజోడు, పైడిపళ్ళెము ౧ కాక ౧౦౦౦ వరహాలున్ను తమదేవులు సమర్పించిన పతకము ౧౦౧ తాళట్టున్ను సమర్పించి దేవర అమృతపడినైవేద్యము అంతరంగవైభవాలకున్ను చాగలమఱ్ఱి సీమలోని మద్దూరు అనేగ్రామమున్ను సమర్పించిరి. ఈసేవ ఆచంద్రార్కస్థాయి అయి నడవవలెనని యిచ్చిన ధర్మశాసనం.

### నెం 4. శాసనము శా. వ. ౧౪౪౧ సం॥ సింహాచలము.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౪౧ (క్రీస్తుశకము 1519) అగు నేటిప్రమాది సంవత్సర శ్రావణ శుద్ధ ౧౩ సోమవారాన శ్రీమన్మహారాజాధిరాజ......కృష్ణదేవరాయలు విజయనగర సింహాసనా రూఢులై సింహాద్రినాథునికి తమ పేరిట భోగము నడిపేటందుకు ప్రతాపరుద్రగజపతిమహీరాయల చేతను పుచ్చుకున్న గ్రామాలు, కళింగదండ పాటలోని గ్రామాలు పెదగాని గ్రామం ౧ అగనంపూడిగ్రామం ౧ అమ్మచెల్లె పల్లెలు ౧ గంగవరంపల్లె ౧ పిన్న అగనంపూడిపల్లె, ఉభయగ్రామాలు ౨ కి సింహగిరి అప్పనికి నడిచే భోగబలిహరణం కట్టడిదినం ౧ కి శ్రీఅంగరంగ భోగానికి గంధము ౧ ఫలము, అగరు ౨ ఫలాలు కర్పూరము ౧ చిన్నము కస్తూరి ౨ చిన్నాలు పన్నీరు ౪ చిన్నాలు కుంకుమపువ్వు ౧ చిన్నం పూవులదండలు నాలుగుమాలెలు ౪ నైవేద్యానకు బియ్యం ౧ పుట్టి పరాళం ౨ తులాలు పాయసంతూనిక్కి ౬ డోరలు ఫేడాలు ౪ సోడీలు ౮ సారసవత్తులు ౮ అరిసెలు ౮ సాదుమనోహరాలు ౮ చిన్న మనోహరాలు ౪ నందిమెడ్డినం ౮ అప్పాలు ౮ హంసకేళీలు ౮ కర్పూరకాలత్తు బడాలు ౮ కక్కరాలు ౪ వెరసి ౮౦ పానకాలు ౨ గట్టిగా కుంచం ౧ నైవేద్యానకున్ను పేరాలమున్ను కూడానైనవి యేడుతూములు వడ్లు ఏడుమున్ను కుంచెడుపళ్ళు పోకలు ౫౦ తములపాకులు ౧౦౦ మిర్యాల సంబారము ౨౭ డబ్బులయెత్తు, జాజికాయలు ౧౦ ఇందుకు వైనంసత్త్రం ౩౦ కి బ్రాహ్మణభోజనం ఈధర్మానకు ఎవరు తప్పితే వారు గంగలో గోహత్య బ్రహ్మహత్య మాతృపితృహత్య చేసిన పాపానపోతారు.

---

# 3 శాసనములు

ఈశాసనముల మూడిటియందును నొక్కటి చిన్నాదేవి తిరుమలనాథదేవునకు బంగారుగిన్నె సమర్పించినట్లుగా తెలుపుచున్నది. రెండవది తిరుమలదేవి తిరువేంగళ నాథదేవునకు పైడిగిన్నె పైడితట్ట సమర్పించినట్లు తెలిపుచున్నది. మూడవది కృష్ణదేవరాయలు తిరువెంగళనాథునకు సమర్పించిన వస్తువులను తెల్పుచున్నది. ఆశాసనముల నీక్రింద నుదహరించుచున్నాడను.

శాసనము—1

శుభమస్తు—స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవరుషాలు ౧౪౩౪టి మీాదనడచే ఆగిరసంవత్సర ఫాల్గుణ (ఫాల్గుణ) శు ౫ లు శ్రీమన్ మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీవీరకృష్ణరాయ మహారాయలదేవులు చిన్నాజీఅమ్మవారు తిరువేంగళనాథదేవునికి అనవాలనైవేద్యం అవసరాలకు గిండ్నె ౧ కి తూకాలు ౩౭౪ పైడిగిన్నె సమర్పించ నవధరించిరి.

శాసనము—2

శుభమస్తు—స్వస్తిశ్రీవిజయాభ్యుదయ శాలివాహనశకవరుషాలు ౧౪౩౪ టిమీాదనడచే ఆంగిర సంవత్సర ఫాగ్గుణ (ఫాల్గుణ) శు ౫ లు శ్రీమన్ మహారాజాధిరాజపరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీకృష్ణరాయ మహారాయల దేవులు తిరుమల అమ్మవారు తిరువేంగళనాథదేవునికి అనవాలు నైవేద్యం అవసరానకు పైడిగిండ్నె 1 కి తూకాలు ౩౭౪ పరికూకాలు అవధరించిన సమర్పించిన పైడితట్ట 1 కి తూకాలు ౧౦ న్ని తమ ఉభయముగాను సమర్పించ నవధరించిరి.

శాసనము—3

శుభమస్తు స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వరుషాలు ౧౪౩౫ టిమీాదనడచే శ్రీముఖసంవత్సర వైశాఖ బ ౧౨ సోమవారాన శ్రీమంన్ మహారాజాధి రాజరాజ పరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరకృష్ణరాయ మహారాయలు శ్రీతిరువేంగళనాధదేవునికి సమర్పించిన తిరువాభరణాల స్వరూపాలు......వ.........వింపుడు. ధార 1 కి అడ్డిగలు ౫ పిన్నఅడ్డిగలు ౪ కడఅడ్డిగలు ౧ అంతు అడ్డిగలు ౧౭ టికి పచ్చలు ౧౭౧ వజ్రాలు ౫౦౧ కెంపులు ౧౧౧ పడల్లిపైడిధార ౧ సహా తూకాలు ౬౬౨ కి ఉడుధార ౧ కఠారివోలి ౧ కి పాతవజ్రాలు ౧౩౧ కెంపులు 33౧ నీలం ౨ సహాతూకాలు ౧౭౧ యీాకఠారికుచ్చు ౧కి ముత్యాలు 3౨౦౦౦ కుచ్చులమీాదిదొడ్డ ముత్యాలు ౧౭ ఇకుచ్చు మీాదికుప్పి బట్టువకెంపులు ౨౧ సహాతూకాలు ౧౨౧ ఉభయం కుచ్చు సహాతూకాలు 3౨౬ కి కఠారి ౧ నిచ్చళం ఉడుధార ౧ కి అడ్డిగలు ౧ కి కెంపులు ౪3 పచ్చలు ౧౫ వజ్రాలు ౧౦ సహాతూకాలు ౧౬౫కి ఉడుధార ౧ కి నిచ్చళం కఠారివోలి 1 కి తూకాలు ౧3౨ యికఠారి పరజుమీాది కెంపులు ౨౪ సన్నపుముత్యాలకుచ్చు ౧ టికి సహా కఠారి ౧ మరిని కఠారివోలి ౧ టికి కెంపులు ౫౫ పచ్చ ౧ వజ్రాలు 3౬ టికి తూకాలు ౧ వలు...........౧ టికి ముత్యాలు ౪ కుచ్చులు......... వజ్రాలు ౧౧౭.

(౨ వ పంక్తి) కి తూకాలు ౧౭। భుజకీర్తిజోటు ౧ కి ముత్యాలు 3౨౨ కెంపులు 3౬౦ నీలాలు ౪ పాతవజ్రాలు ౨౮౭ సహా తూకాలు ౫౭3 టికి భుజకీర్తిజోడు ౧ టి నిచ్చళం భుజకీర్తిజోడు ౧ టికి తూకాలు ౧౧౧ వుభయం భుజకీర్తిజోళు ౨ పట ౧ టికి అడ్డిగలు ౧౭ రావిఆకు అడ్డిగలు 3౦ కి ముత్యాలు 3౦ కెంపులు ౨౧౦ వజ్రాలు ౫౧

పచ్చలు ౯ సహా తూకాలు ౨౦౯ కి.....౧ కి ముత్యాలు ౧౨౨ కెంపులు ౧౫3 వజ్రాలు ౧౦౪ రావిఆకు వెండిముత్యాలు 33 టికి తూకాలు...తూకాలు ౨౭౬ టికి పట్టు ౧ టి వుభయంపట్టాలు ౨ ఉత్సవ దేవళ కిరీటాలు 3 కి ముత్యాలు ౪౦౯ పాతవజ్రాలు ౨౫౪ కెంపులు ౫౨౨ వైడూర్య ౧ నీలాలు ౬ సహా తూకాలు 3౫౦ కిరీటాలు యింతవట్టున్ను తమ సేవగాను సమర్పించ నవధరించిరి.

ఈ శాసనములు మూడును తిరుపతిలో లభించినవి.

గద్యము. ఇది శ్రీ రమారమణ చరణసేవాతత్పర హారితస
గోత్రపవిత్ర మద్దూరివంశ లతాంకూతనర సమాంబా
సోమనార్యపుత్ర శ్రీ రామమూర్తి నామధేయ
పరిణీతంబైన శ్రీకృష్ణదేవరాయ చరిత్రము
సర్వమును సంపూర్ణము.



# అనుబంధము.



మ. శరసంధాన బలక్షమాది వివిధై । శ్వర్యంబులంగల్గి దు
ర్భరమండత్వ బిలప్రవేశ చలన బ్రి । హ్మఘ్నత ల్మానిర్ర
నరసింహక్షితి మండలేశ్వరుల నె । న్ననవచ్చు నీసాటిగా
నరసింహక్షితి మండలేశ్వరుని । కృష్ణా రాజకంఠీరవా !

శరసంధానమున ప్రఖ్యాతిగన్న నరునకు దుర్భరమైన షండత్వ మున్నది. బలమైన సింహమునకు గుహాదూరు స్వభావమున్నది. క్షమా స్వితమైన భూదేవికి చలనత్వమున్నది. వివిధైశ్వర్యంబులు గలిగిన యీశ్వరునకు బ్రహ్మహత్యాపాతకమున్నది. వారలయందున్న లోప ములు మానినచో కృష్ణరాయా! వారల నీతో సమానమని చెప్ప వచ్చును.

సంపూర్ణము.



# వైజయంతీవిలాసము

అను

విప్రనారాయణ చరిత్రము

సారంగు తమ్మయామాత్య విరచితము రు 0—12—0

# విజయవిలాసము

(పూర్వకవి) చేమకూర వెంకటకవి 0-12-0

స్వారోచిష

# మనుచరిత్రము

అల్లసాని పెద్దనకవి విరచితము రు 0—12—0

# ప్రభావతీప్రద్యుమ్నము

పింగళి సూరనార్యకవిప్రణీతము రు 0—12—0

---

(సుపుకేటి వెంకట్రామయ్య అండ్ బ్రదర్స్, రాజమండ్రి)

# భోజరాజచరిత్రము

నూతనము.      వెల రు 1-0-0      నవరసభరితము.

అపూర్వము.      ముక్తిదాయకము

శ్రీ అయినాపురపు సోమేశ్వరరాయకవి విరచితము.

ఇంతవరకు ఆంధ్రదేశమున భోజనామము విన్నవారే కాని ఆమహారాజు కథలు తెలిసినవారు లేరు. ఆలోప మీగ్రంథము వలన తీరినదని నిశ్చయముగ చెప్పగలము. భోజుని ఆస్థానమందు కవిచక్రవర్తుల కవితావిలాసములు, కాళిదాసు ప్రతిభ పండితులచర్యలు, భోజుని ఔదార్యము, వేశ్యాంగనా వర్ణనాది చిత్రవిచిత్ర చమత్కారబంధుర సుందరకథావల్లరి నవరసభరితమై, ఆహ్లాదజనకమై మనోమోహనమై చదువువారి చవులూరజేయుచుండును. భోజుని జీవితమందలి గభీర విషయముల చదివి తీరవలయునని వారుండరు. బహుప్రయాసముచే పలుస్థలములనుండి వివిధ విషయముల సేకరించి వ్రాసిన యీగ్రంథము ప్రతి యువరాజ్ఞుల కరము నలంకరింపతగినది. క్రౌ 1/8 ముద్రితము. 140 పేజీలు.

# ప్రమదామనోహరము

ఇది "శ్రీయుత అయినాపురపు సోమేశ్వరరావుగారిచే" రచియింపబడిన 7 అంకముల నవీన నాటకము. ఈ నాటకము పలుమారు బహుపురిసభల ప్రదర్శింపబడి వన్నెకెక్కియున్నది. ఇందు పుష్పకేతు, విజయసేనుని ప్రతిజ్ఞావాక్యములు వినిన భయానకరసంబును, వీరరసపూరమును కగపడకుండ లేకుండుటకై విక్రమార్కుని నీతిబోధయు, చదివి యానందింపవలసినదే గాని వర్ణించుటవలన లాభములేదు. కథానాయికయగు "ప్రమద" సముచితానుగుణ్యముగా చూపించు శోక, ధైర్యస్థైర్యము లోకమాయ చదివిచూచిన "శెభాష్" అని యనకుండ నెవ్వరైన నుండగలరా! చంద్రకేతుని సాహసౌదార్యములు గాంచి తెలియవలసినదే. విజయసేనుని ప్రతిజ్ఞానిర్వాహణము గాంచి శిరఃకంపము నొనరింపవలసినదే. పుష్పకేతుని దుష్ప్రవర్తనఁ గాంచి ఛీ ఛీ యనక తీరదు. వేయేల నాటకము గాంచినచో మీరు వ్రాసిన దానియందలి యౌదార్యము మీకే బోధపడును. ద్వితీయముద్రణ మిప్పుడే వెలువడినది. త్వరపడకున్నచో ప్రతులు లభింపవు.

వెల రు 0-10-0

---